# గృహలక్ష్మి



# GRIHALAKSHMI

15th OCTOBER 1956

Vol. No. 25 No. 10

# రూప సంపదకు

## చేనేత బట్టలు వాడండి

రకరకాల డిజైనులలో, సరిక్రొత్త రీతులలో అపూర్వములగు చేనేత బట్టలు సాంప్రదాయిక మరియు ఆధునిక అభిరుచులకు అనుగుణ్యంగా లభిస్తాయి.



మీరు ధరించడానికి, మీ ఇంటి అలంకరణకు అతిసున్నితమైనవి

# చేనేత బట్టలు

ఆల్ ఇండియా హాండ్‌లూమ్ బోర్డ్
బొంబాయి - మద్రాసు - కాన్పూర్






వ్యవస్థాపకులు :

డాక్టరు కే. యన్. కేసరి


# గృహలక్ష్మి

విజ్ఞాన వినోద ఆరోగ్య సౌభాగ్యములను

పెంపొందించుటకు ఏర్పడిన స్త్రీల

సచిత్ర మాస పత్రిక


ప్రొప్రైటర్లు : కేసరి కుటీరం ప్రైవేట్ లిమిటెడ్.

ఆక్టింగ్ ఎడిటర్ :

సి. సి. పున్నయ్య

సంపుటము 25]     అక్టోబరు 1956     [సంచిక 10

# వి ష య సూ చి క





చిత్రసమీక్ష



# మేలుకొలుపు



ఆనందావారి 'మేలుకొలుపు' చిత్రము యీ నాటి సంఘంలోని వాస్తవిక పరిస్థితులను చిత్రించడంలో కృతకృత్యమైనదని చెప్పాలి.

ఇందులో మధ్య తరగతి ప్రజానీకపు వాస్తవికత కతీతులనే యూహాలు, దానివలన ఆత్మవంచకులై పడుతున్న పడరాని పాట్లు బహు చక్కగా చిత్రించబడినవి.

ముఖ్యంగా మధ్య తరగతి కుటుంబాలలో ఒక యింట్లో ఒక పురుషుడు సంపాదిస్తుంటే ఉన్న ఆడ మగ పది మంది తిని కూర్చోడం వలన చితికి పోతున్న సంసారమును చిత్రించి లేని హెచ్చులకు పోకుండా ఉన్న నలుగురూ అవకాశములను, శక్తి సామర్థ్యముల ననుసరించి చాకిరిచేసికోడం అగౌరవమయిన పని గాదని యిందులో ప్రబోధించబడింది. అవకాశవాదులైన స్వార్థపరులు సభ్యతకు, న్యాయానికి ఎలాగ వ్యతిరేక శక్తులో యీనాటి సంఘంలో చిత్రించబడినది.

కథ సాఫీగా మాత్రమే కాక ప్రతి క్షణం ప్రేక్షకులలో ఆసక్తిని రేకెత్తిస్తుంది. పాటలు, మాటలు పొందికగా నున్నవి. సంగీతము బాగుంది; జి. వరలక్ష్మి సి. యస్. ఆర్ ల నటనా కౌశలం పేర్కొనతగినది.

మధ్య తరగతి ప్రజానీకమునకు జీవిత భావి భాగ్యోదయంలో యీ చిత్రము అనేక విధాల ఉపయోగపడగలదు. దాంతోపాటు ఆకర్షణీయంగా సైతమున్నది.

'సిసి'




జయజయ గృహలక్ష్మీ సఖి! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



# అభ్యుదయ పరంపరలు

స్వీయ అభ్యుదయాన్ని, అభివృద్ధిని ఉద్దేశించి సంవత్సరాల పర్యంతము తెలుగు భాషాప్రాంతాలు ఏకంకావడానికి సాగిన ఉద్యమం, జరిగిన ఆందోళన ఫలితమే ఏర్పడిన ఆంధ్రరాష్ట్రము, ఏర్పడనున్న ఆంధ్రప్రదేశ్ న్నూ. ఈ ఏటి ఆంధ్రరాష్ట్రావతరణ మహోత్సవాలు ప్రతి తెలుగుబిడ్డలోను తనయొక్క, తన దేశంయొక్క పురోభివృద్ధికి అమరిన, అమరనున్న అవకాశాలను వ్యక్తముచేయుటయేకాక యీ సందర్భమున తనయొక్క గురుతర బాధ్యతలను జ్ఞాపకపరచినవి.

ఆంధ్రోద్యమంలో వీరోచితంగాపోరాడి సోదర ప్రజానీకపు అభ్యుదయ పురోభివృద్ధులకుగాను అఖండత్యాగాలుచేసిన ప్రజలు, నాయకులు - ముఖ్యంగా అమరజీవి శ్రీ పొట్టి శ్రీరాములుగారు చిర స్మరణీయులు. ఆయన పవిత్రత్యాగఫలితమే ఆంధ్రరాష్ట్ర నిర్మాణమునకు, దాని ననుసరించిన ఆంధ్రప్రదేశ్ నిర్మాణమునకు దోహద

మయింది. ఆంధ్రోద్యమ సాఫల్యానికి శ్రీ శ్రీరాములుగారి సేవాత్యాగములు అమూల్యములై ఆయన జోహారులందుకుంటున్నాడు.

ఆంధ్రప్రదేశ్ నిర్మాణ సందర్భమున ఏర్పడవలసిన రాష్ట్రమంత్రివర్గ విషయంలో ప్రజలు, ప్రజాప్రతినిధులు గుర్తించవలసినది – వ్యక్తిగతఘనతకు, స్వార్థమున కంటె ప్రజాహితముపట్ల, జాతీయసౌభాగ్యముపట్ల ఆసక్తిచూపగల నాయకత్వము అధికారము చేపట్టడం. ఎవరు ముఖ్యమంత్రియైనా, ఎవరు మంత్రులైనా సామాజిక శ్రేయస్సుపట్ల ఆసక్తిగల సమర్థులు అధికారంలోకి రావాలి!

కలిమిలేముల మధ్యగల భేదమును సాధ్యమయినంత త్వరలో తగ్గించి జాతీయావకాశములను, సంపదను సమాజిక శ్రేయస్సుకు, సౌభాగ్యమునకు సమానంగా విశాల హృదయంతో వినియోగపరచకలిగే సంస్కరణలను శరవేగంగా ప్రోత్సహించి అమలుపరచకలిగే మంత్రివర్గం అధికారంలోకి రావాలి !

ఆంధ్రరాష్ట్ర నిర్మాణం జరిగినా, ఆంధ్రప్రదేశ్ నిర్మాణం జరిగినా ప్రజల శ్రేయోపురోభివృద్ధుల నుద్దేశించి జరిగినవికాని స్వార్థము నుద్దేశించి అధికార వ్యామోహమునకు ప్రాకులాడేవారికి సామాన్య ప్రజల భవిష్యత్తును బలియియ్యడానికికావు. ప్రజలు, ప్రజాప్రతినిధులు వాస్తవికతకు దూరమయి సంకుచిత వ్యామోహాలకు లోబడినచో ఏర్పడనున్న ఫలితాలు యీనాటి రాజకీయరంగంలోని కలతలకంటె మెరుగుగా నుండవు. పైగా సోదరప్రజానీకపు శ్రేయోపురోభివృద్ధులకుగాను తన ప్రాణములను సయితం త్యాగంచేసిన అమరజీవి శ్రీరాములుగారిపట్ల ఆంధ్రప్రజానీకం తీరని అపచారంచేసిన వారగుదురు.

ఆంధ్రప్రదేశ్ జాతీయ సౌభాగ్యమునకు పెట్టినపేరుగాను, యావద్భారతమునకు ఆదర్శనీయమైన రాష్ట్రముగాను రూపొందాలి! ఆంధ్రప్రదేశ్‌లోని సిరిసంపదలు, ఉన్న విస్తృత అవకాశములు యావత్ప్రజానీకానికి చేతినిండా పనిన్ని, దాని ననుసరించిన ఆదాయాన్ని సమకూర్చాలి. ప్రజలలో ఏ ఒక్కరు నిత్య ప్రధాన జీవనావసరాలులేక అలమటిస్తున్నా మిగిలినవారికది అవమానకరమని గుర్తించాలి!

అవతారమూర్తిగా గాంధీజీ పీడిత ప్రజానీకంలో ఆశా జ్యోతిని వెలిగించాడు. ప్రతియొక్కరు నిత్యావసరాలతో గౌరవంగా జీవయాత్ర సాగించడమనేది జన్మ

హక్కుని పూరించాడు. సత్యం, అహింసల శాస్త్రమును బోధించి మహత్తరమైన ఆత్మబలమును, నైతిక స్థాయిని పెంపొందజేశాడు. ఆయన బోధనలు, నిర్మాణ కార్యక్రమ మార్గాలు శాంతియుత సహజీవనాన్ని ఆశించే ప్రతి వ్యక్తికి, ప్రతి దేశానికి మార్గదర్శకములు. గాంధీజీపట్ల భక్తి శ్రద్ధలు యీ తరానికే కాదు, రానున్న తరతరాలకుండవలసినవి. అవి విగ్రహారాధనకు మాత్రం పరిమితం కాక ఆయన ఆదర్శ లక్ష్యాలు అనుసరించవలసినవి. గాంధీజీ హృదయము సర్వ మానవ శ్రేయస్సు నుద్దేశించినది.

ఏర్పడనున్న ఆంధ్ర ప్రదేశ్ మంత్రివర్గం, ప్రజా శ్రేయస్సును రూపొందించవలసిన ప్రజా ప్రతినిధులు గాంధీజీ ఉద్దేశించిన 'రామరాజ్య' స్థాపనకు దోహదం చేయుదురుగాక.

# చిత్త చిత్రము

శ్రీ చక్రవర్తి రంగస్వామి

బలేబలే చిత్తకార్తె
చిత్రమైన చిత్తకార్తె

నల్లమబ్బు లొకవైపున
చండసూర్యుడొకవైపున
వేడిఎండ, పెద్దజల్లు
ఒకటినొకటి తరిమిఆడు

బలే బలే.

తెల్లమబ్బులొకవైపున
కొండలుగా పెరిగివచ్చి
లేతఎండ చెదరకుండ
జల్లుజల్లుమనిపోవును

బలేబలే.

ఇంతలోనె ఉరుకురుకును
ఇంతలోనె ఫెళఫెళలును
ఇంతలోనె వరదగూడు
వింతగొలుపు చూడజూడ

బలేబలే.

అంతలోనె క్రమ్ముకొనుచు
కటికచీకటైపోవును
అంతలోనె మబ్బువిచ్చి
తెరిపిఎండ తెగకాయును

బలేబలే.

# స్త్రీ ధర్మము

మూలము :

"భూమండలేశ్వర" స్వామి శివానంద సరస్వతీజీ మహరాజ్

అనువాదము :

"శివానందపాదసేవక్" స్వామి శ్రీనివాసానంద సరస్వతి



(గతసంచిక తరువాయి)

విశ్వ విద్యాలయములలో డిగ్రీగొనుట వాస్తవిక సంస్కృతి లేదా నిజమగు విద్యకాదు. ఏ పిల్లయైన కొన్ని పుస్తకముల కంఠస్థమొనర్చి డిగ్రీని పొంద జాలును. వలయునదేమన నైతిక కృషి, ఆత్మ జ్ఞానము, అధోస్వభావపు (lower nature) పునరుద్ధారణ, ఉత్తమ నడవడి, పరిశుభ్ర రీతులు, యింద్రియ శిక్షణ, మనస్సు, యింద్రియముల వశీకరణ, ఘనమగు దివ్య సుగుణముల పెంపొందించుటయే. నేటి కాలపు విశ్వ విద్యాలయములలో నిట్టి యరుదగు శిక్షణ నొందబడ జాలును. విద్యార్థి తగు నైతిక తర్ఫీదు (శిక్షణ) కలిగి యుండవలెను. అప్పుడు మాత్రమే విశ్వ విద్యాలయములు తగు విద్యా సంస్కృతులతోడ బాల బాలికల వెలుపలకు పంప జాలును.

స్త్రీ సక్రమ మార్గముల విద్య గఱుపబడవలెను. దేశీయ సమస్యల నవగాహన చేసుకొగల్గి యుండవలెను. ఆమె దేశమునకు తన సహాయమును, సేవను, తన అవకాశములు, శక్తిసామర్థ్యముల కనుగుణమగు విధమున చేయవలెను. ఏదేశమైన నిర్మింప బడవలెనన్న స్త్రీలు యుచితమగు, తగు సంస్కృతి కలిగియుండవలెను. భావి వంశము నేటి మాత (తల్లి) పై ఆధారపడియున్నది. మాత దేశమునకు వెన్నెముకయే. ఈ ప్రపంచ నాటకమున నామె ప్రాధాన్య, పవిత్రపాత్ర వహింపవలెను. ఆమె జాతిని నిర్మించి, దృఢ పరుపవలెను. ఆమె ప్రపంచపు భావి పౌరులగు బిడ్డల తర్ఫీదొనర్పవలెను. బిడ్డలకు వర్ణమాల (ఓనమాలు — alphabet) బోధించునదామెయే. ఆమె వారికి నైతిక, ధార్మిక శిక్షణ నొసగవలెను.

ఆమె విద్యావంతురాలగుచో మాత్రమే నామె బిడ్డలు సరియగు రీతిని తర్ఫీదు, శిక్షణ యొనర్చబడుదురు. ఆమె ధార్మిక (religious) మగుచో మాత్రమే నామె తన బిడ్డలు ధార్మికవంతులగుదురు. ఆమె నైతిక శాస్త్రమున శిక్షణ గఱుపబడుచో నప్పుడు మాత్రమే నామె బిడ్డలకు నైతిక విద్యను ప్రసాదింప జాలును. కాన బాలికలు, స్త్రీలు తమ గొప్ప జీవిత కార్యమునకు తయారగుటకుగాను తమంతట తాముచితరీతిని విద్యావంతులగుట సమంజసమై యున్నది.

## గృహస్థ జీవనము

మతము (ధర్మము) స్త్రీలచే మాత్రమే నిలబెట్ట బడుచున్నది. వారిలో విచిత్రమగు మత విషయకాంతర్య సహజ ప్రేరణ ( instinct ) గలదు. వారత్యమితముగ భక్తిమయులు. వారు మతసత్త్వను (religious spirit) పురుషులలో తమదైనిక వర్తన, అనుష్ఠాన జీవితములద్వారా ప్రవేశ పర్తురు. వారు పెందల కడనే నుదయమున లేతురు, గృహముల శుభ్రపర్తురు (నూడ్తురు), స్నానము చేయుదురు, జప మొనర్తురు, తమ యింటిలో నిత్యపూజ (ఉపాసన) కై నొక చిన్న

దేవళము (మందిరము) నిర్మింతురు, నింకను నట భగవానుని, జ్ఞానుల, భక్తుల చిత్ర పటముల నుంతురు. వారా స్థలమును పవిత్రముగ నుంచి యుదయ సాయంతనముల, ప్రార్థనల, హారతి (నారాధన) జరుపుదురు. ఇంటి యందలి నాస్తిక పురుష వ్యక్తులు వారి ప్రభావము ద్వారా నేదియో ప్రార్థనతో లేదా మఱియొకటియో నొనర్ప బలవంతము చేయబడుదురు. వాస్తవికముగ మహిళలు గృహమును పాలింతురు. వార శక్తియొక్క వ్యక్త స్వరూపులు.

భర్త ఆధ్యాత్మికత్వములో నెగువకు జనుచుండ భార్య వానిని దిగువకు నింద్రియ విషయక మార్గములలో లాగుచును నటులనే తానుమారగుచును, అనగా భార్యాధ్యాత్మికముగ నెగువకుజనుచుండ భర్త యింద్రియ విషయక మార్గములలోను దిగువకు లాగుచును నెట నుందురో నా గృహము పాడు స్థలమే, పృథ్విపై ప్రత్యక్ష నరకమే. వారాత్మజ్ఞానమనెడి సూత్రము (త్రాటి)తో మేళవింపుగ కలుపబడి లేదా లంకింపబడి భగవచ్చైతన్య మొందుట కాదుర్దాగ ప్రతియొక్కరును కాంక్షించుచు నుండవలెను. ఎటనైతే భార్యాభర్తలాదర్శ జీవనము గడుపుదురో, భగవన్నామమును సంకీర్తింతురో, భన్మంత్రమును జపింతురో, ధార్మిక గ్రంథ, ముల పారాయణ మొనర్తురో నింద్రియములను వశపర్చుకొందురో, మహాత్ముల, జ్ఞానుల సేవింతురో నా గృహము నిజముగ స్వర్గమే (వైకుంఠమే).

ఎవతె ఉత్తమ గృహిణియో నామెయే నిజమగు భార్య. ఎవతె హృదయము తన భర్తపట్ల ననురాగ బద్ధమై యుండునో నామెయే నిజమగు భార్య. ఎవతె తన భర్తపట్ల విశ్వసనీయమై యుండునో నామెయే నిజమగు భార్య. భార్య ధర్మార్థ కామములకు మూలము. ఆనంద సమయమున మధురముగ సంభాషించు భార్య భర్తకు మిత్రమే. ధార్మిక కృత్యావసరముల నామె తండ్రి వంటిది. వ్యాధి, విచార వేళల నాపె తల్లి వంటిది.

సాదా దుస్తుల ధరించి, సాదా భోజన మొనర్చి, సాధుల బీదల సేవించి, పండిత, సన్యాసుల మధ్య వసించెడి సంయుక్త పరగణాల (United Provinces) లో నొక మహారాణి యుండెడిది. ధర్మ శాస్త్రముల దృఢ జ్ఞానము గల్గియుండి, సక్రమ ప్రార్థనల, ధ్యానము నొనర్చుచు, నెలలతరబడి మౌనము వహించుచునే కొండ వాసమున కొంత కాలము గడుపుచు సంస్థానమునుగూడ పాలించెడిది. అఖ్యాత నొందిన వైద్య (M. B., B. S.) యగు విద్యావంతురాలైన మహిళ గలదు. ఆపె భర్త యొక్క ఉత్తమ హోదాను వహించుచుండెను. ఆమె రోగుల నుచితముగ చికిత్స చేయును; (రోగుల) దర్శించుటకై నెట్టి మొత్తముల (fees) నామె వసూలు చేయదు. మానవజాతి కామె చాల యుత్తమమగు సేవచేయుచున్నది. రోగపీడితులకు, బీదలకు నుచిత వైద్య సహాయ మామె యొసగును. రోగుల సేవయే భగవదారాధనగ నామె గొనును. ఆమె గృహ కృత్యముల చూచుకొనుచు తన భర్తను సేవించును. మత గ్రంథముల చదువుచు సాధనలో తన కాలమును వినియోగించును. ఆమె వైభవోపేతమగు, భగవదీయ జీవనము గడపు నాదర్శ స్త్రీ.

## సాధన సాంఘిక సేవ

వైద్యజ్ఞానముగలవారు గ్రామముల దర్శించి రోగులకు, బీద జనులకు మందుల పంచిపెట్ట నగును. సంస్కృతము, నాంగ్లము, హిందీలలో సువేత్తయు, బాలికల విద్యా సంస్థాధీనురాలును నగు నున్నత విద్యావంతురాలగు బ్రహ్మచారిణి యుత్తర హిందూస్థానములో గలదు. తన స్వంత ఖర్చులో బీద బాలికలకై నుచితముగ స్వకీయ, ప్రత్యేక పాఠశాలను నడుపుచున్నది. నిజముగ నిది చాల గొప్ప సేవ.

ఇట్టి బాలికలు, స్త్రీలు వాస్తవికముగ దేశమునకొక ఆశీర్వాదము. వారు పవిత్ర, ఆత్మబలిదాన జీవితము గడుపుదురు. వారానందమును, నైశ్వర్యము, ప్రఖ్యాత నటననుభవించి పరమశాంతి యొక్క నమృత (మోక్ష) ధామమున నిటు పిమ్మటకూడ నిండుదురు. తమ యావజ్జీవమును సేవకు, ధ్యానమునకు, ప్రార్థనకు నంకితమొనర్పగల నిట్టి వర్ణనగల నధికతర బ్రహ్మచారిణుల ప్రపంచ మెంతేనియు కావలసియున్నది.

విద్యావంతులగు మహిళలు మానవ సంఘమునకు తమ సామర్థ్యము, అభిరుచి, మానసిక తత్త్వము, నభిలాష, స్వభావము, విద్యయొక్క నంతస్థులబట్టి వారి జీవిత విధానపు ధర్మము లేదా సుప్రతిష్ఠిత నియమముల కనుగుణమగు లేదా సంపూర్తి పొందికయగు రీతిగ నెట్టి ప్రయోజన కారక సేవలైనను చేయ నగును.

తమపైనను, తమ కుటుంబము పైనను అమర్యాదను లేదా నపకీర్తిని, తమ శీలమునకు మచ్చనుగాని తెచ్చు దాని నేదైనను వారొనర్పరాదు. శీలములేనిదే పురుషుడు లేదా స్త్రీ బ్రతికియుండియు చచ్చిన వారుగ పరిగణింప బడుదురు. వారు సమాజములో సంచరించు నపుడు చాల జాగ్రత్తగ, మెలకువగనుండవలెను. వారత్యధిక ప్రసంగము, నత్యధిక కలిసి మెలగుట (mixing) ను త్యజింపవలెను.

## త్యాగ మార్గము

పూర్వపు రోజులలో భారత దేశమున బ్రహ్మచారిణులుండెడివారు. వారు బ్రహ్మవాదినులు. వారు గృహస్థ జీవనమున ప్రవేశించి యుండలేదు. ఋషుల, భగవద్భక్తుల (మహాత్ముల) యాశ్రమములలో నుంటూ, ఆధ్యాత్మిక సాధన నొనర్చెడివారు. "జనశ్రుతి" యను రాజు తన కూతును రైక్వ ఋషిసేవ పట్ల నుంచి యుండెను. దీనిని మీరు ఛాందోగ్యోపనిషత్తున గనుదురు. "గార్గి" యొక అత్యుత్తమ సంస్కృతిగల మహిళ. ఆమె రాజగు జనకునితో బ్రహ్మ విద్యనుగురించి దీర్ఘ చర్చను జరిపియుండెను.

ఐరోపా దేశములోకూడ బ్రహ్మచారిణులుగ నుంటూ తమ జీవితములనుగ్రహ తపస్సు, ప్రార్థన, ప్రజాసేవా జీవనమునకై సంపూర్తిగ సమర్పణ మొనర్చిన బహు మహిళలు గలరు. హిందూ దేశములోకూడ బ్రహ్మచారిణుల జీవితము గడుపుచున్న విద్యావంతులగు స్త్రీలు ప్రస్తుత క్షణమున సహితము కలరు.

వారు వివాహమాడరు. ఇదింతకుముందు జన్మలోని వారి యుత్తమాధ్యాత్మిక సంస్కారముల ప్రాబల్యము మూలముననే. మానవ సమాజమునకు వారతీతమైన సేవ నొనర్చుచున్నారు. స్వార్థ రహిత సేవగ, వారు బాల బాలికలకు ప్రత్యేక విద్యా శిక్షణ (private tuition) నొసగుదురు, విద్యార్థులకు కుట్టుటకు (దర్జీపనిని) యితర గృహకృత్యముల నేర్పుదురు. పెందలకడ నుదయసాయంతనముల వారు మత గ్రంథముల పఠించి క్రమ ధ్యాన మభ్యసింతురు. వారు కీర్తన మొనర్చి దైనికాధ్యాత్మిక దినచర్య (daily spiritual diary) నుంచుదురు. వారు స్త్రీలలో గీతా తరగతుల (class) కూడ నడిపి యితరుల నుత్తమారోగ్యము, దీర్ఘాయువు నిలబెట్టుకొనుటకై యోగాసన, ప్రాణాయామాభ్యాసమున శిక్షణ నొసంగుదురు. సెలవు దినముల, ప్రధానోత్సవ దినముల ప్రజాకోటి కాధ్యాత్మిక మేల్కొల్పుకై గొప్ప ప్రమాణము (grand scale) లో మత సమావేశములవారు నడుపుదురు. చాలమంది వారినుండి యుత్తేజ మొందుదురు.

ఈ రోజుకు సహితము బ్రహ్మచర్య వ్రతముగొని హిందూ దేశములోని కొన్ని యాశ్రమములలో వసించుచు తమ కాలమును ప్రజాసేవకై వినియోగించు అమెరికా మహిళల మీరు గన నగును. ప్రపంచ యాదర్శ స్త్రీలు మనకు ఆవశ్యకత యున్నది. ప్రపంచము వైభవోపేతమగు స్త్రీలతో నిండి యుండుట వాంఛితును.

పంథములు లేని స్త్రీలు: "స్త్రీలు సన్న్యాసము (విరాగిణుల సాంప్రదాయము) గైకొన నగునా?" యని సాధారణముగ నడుగుదురు. పూర్వకాలములో "సులభ" సన్యాసము తీసుకొని నొంటరిగ పృథ్విపై సంచరించెను. ఇప్పుడుకూడ హిందూ దేశములో కొందఱు సంస్కృతిగల సన్న్యాసినులు గలరు. సమస్త మతములలో సన్న్యాసినీ (విరాగిణీ) సాంప్రదాయము కలదు. వారు తమ కాలమును మత గ్రంథముల పారాయణ మొనర్చుటలోను గడుపుదురు. వారు సంచరించుచు నాధ్యాత్మిక జ్ఞానమును, వేదాంత తత్త్వము, మతములపై నుపన్యాసము లొసగుట ద్వారా ప్రచార మొనర్తురు. తీరుబడి సమయములలో వివిధ మత సంస్థల ద్వారా ప్రజానీకమునకు వారు సేవ నొనర్తురు. వారు శోభావంతమగు జీవితము గడుపుదురు. వారనుచరానీకమునుగూడ కల్గి యుందురు. (సశేషము)



# రేడియో

## ఉత్తమ గృహిణులు - సుగాత్రి

శ్రీమతి దేశిరాజు భారతీదేవి

మన ప్రాచీన వాఙ్మయము విశ్వకళ్యాణము నుద్దేశించి సృష్టింపబడియున్నది. అనగా విశ్వమానవ శ్రేయము - అందుచేతనే మన పూర్వులు "విశ్వశ్రేయః కావ్యమ్" అని వాక్కాణించి యున్నారు. దైవ భక్తి, ధర్మబోధము, సాంఘిక నీతి అను మూడు విధములైన ఆదర్శముల నాచరణపై నాధారపడి యున్నది. కావున మన పూర్వులు యీ ముత్తెఱంగుల లక్షణముల చొప్పించి కావ్యముల రచించి యున్నారు. కాల క్రమమున ప్రబంధ కావ్య రచనా పద్ధతి వచ్చినను శృంగార రసమునకు ప్రాముఖ్యత వచ్చినను, పైన దెల్పిన నైతిక ధర్మములకు ద్వితీయ స్థానమిచ్చుచు వచ్చిరి. మన తెలుగు కవులు ప్రబంధములలో దైవ ప్రార్థన మరువలేదు. సంఘ నైతిక ధర్మముల చెప్పక విడువలేదు. ఆర్య ప్రబంధమని పేరెన్నిక గన్న మను చరిత్రలో పెద్దన్నగారు ప్రవరాఖ్యుని వర్తన ద్వారా స్వధర్మాచరణయందు కర్మిష్ఠికుండవలసిన భక్తి విశ్వాసములు, శీల రక్షణ మున్నగు నీతులు లోకమునకు దెల్పియున్నారు.

అట్లె పింగళి సూరనార్యుడు తన కళాపూర్ణోదయ కావ్యమున నిరుపమాన కల్పనా కౌశలమును, చాతుర్యమును ప్రదర్శించుచు శృంగారమునకు ప్రాధాన్యమిచ్చినను అందలి స్త్రీ పురుష పాత్రలను చిత్రించుటలో సయితము స్త్రీ పురుషుల ధర్మమును సుబోధకముగ ప్రకాశింపజేసి యున్నాడు. అద్భుతమైన సన్నివేశములు గల్పించినను పాత్రల యౌచిత్యమునకు భంగము వాటిల్లలేదు. అందు సుగాత్రీ శాలీనులచరిత్ర మొకటి. శాలీనుడొక బ్రాహ్మణుడు. తన ప్రవర్తనచేత లోకములోని పురుషులకొక నీతిని బోధించిన గృహస్థు.

సుగాత్రి కాశ్మీర దేశమున శారదా పీఠమున పూజారియగు బ్రాహ్మణుని కుమారిత. ఆయమను శాలీనునకిచ్చి వివాహ మొనర్చి అల్లుని యింటియందే యిల్లడ

ముంచుకొన్నది సుగాత్రితల్లి. తనకు పుత్రులులేకున్నను తన పుత్రికకైన పుత్రులుద్భవించి తన ముప్పు గడపుదురను నాసతో నామె యున్నది. ఇక సుగాత్రి యన్ననో బాల్యమునుండియు భక్తిశ్రద్ధలతో శారదాదేవి నర్చించుచు పతివ్రత యని పేరొందినది. ఆమె సద్గుణములు యిల్లాండ్రకాదర్శప్రాయమైనవి. ఇంతియే గాక సుగాత్రి భక్తికిమెచ్చి,

రాత్రింబవళ్లు దృఢ సే
వా తాత్పర్యముననున్న వారలటుండన్
నీ తోడ మాటలాడును
పాతివ్రత్యమునగాదె భారతి కృపతోన్

ఇయ్యవి యామెతల్లి వచనములు. ఇట్టి పుత్రిక మనస్సు నొవ్వకుండ ప్రవర్తింప వలసియున్నది తల్లి.

శాలీనుడన్ననో శారదా పూజాధురంధరుడు. సహజసౌందర్యాభిలాషి. వేషభాషలు గిట్టవు, వివిధాలంకార శోభితయగు సుగాత్రిని కన్నెత్తి చూచుటకైన నిచ్ఛగింపడు. యీతని చిత్తవృత్తి నెఱుంగని అత్తగారనేక విధములగు నుపాయముల నాలోచించి విసుగుజెంది వారి సమాగమ మాకాంక్షించుచుండెను. అల్లునేమన్నను పతిప్రాణయగు కూతు మనస్సేమి బాధపడునోయను భీతిచే నూరకుండెను. సుగాత్రి తల్లి పంపున ప్రతి నిత్యము భర్త సన్నిధికివచ్చుచు బోవుచుండెను. యుచితరీతి నాతనికి సపర్యలు చేయుచుండెను. కాని యీ అలంకారములు, కృత్రిమపు శృంగారములు గిట్టని శాలీను డామె నాదరింపలేదు. ఇట్లు కొన్నాళ్లుండ తల్లి యిక నోపికలేక తమ పూదోటలో నౌకర్లను దొలగించి యాపనులైన చేయించదలచి, అల్లుని తోటపరామర్శించి రమ్మను నెపమున ప్రతి నిత్యము తోటలోనికి బంపుచుండెను.

శాలీనుండును శారదాపూజ కుపకరించు పుష్పములు స్వయముగా దెచ్చుకొనవచ్చుననియు, ప్రశాంతముగ నచ్చటనే ధ్యానముచేసికొనవచ్చుననియు, నా తోటపని తన కత్యంత సంతోషమును గూర్ప ప్రతిదినమట్లే వచ్చుచు బోవుచు నచ్చటి పనులన్నియు చేయుచుండెను. ఈ చర్యనంతయు సుగాత్రిగాంచి విచారించుచు తన భర్త కష్టముచేయుట చూడజాలక తన తల్లి చేసినపనికి దుఃఖించుచుండెను. ఒకా నొకప్పుడు తానేగి యాతనికి పనులలో సాయపడగోరును; కాని లజ్జచే వెళ్ళలేక మిన్నకుండును. ఇట్లుండ నొకనాడాకసము మేఘావృతమై భయంకర గర్జనలతో కుంభవృష్టి గురియ సాగెను. శాలీనుడు తోటలో పనులు చేయుచుండెను. సుగాత్రి దుఃఖము చెప్ప శక్యముగాదు. తన భర్త యీ వానలో

(554-పేజి చూడుడు)



కథానిక

# కౌసల్య

'శార్వాణి'



"హృదయ పరివర్తనలేనపుడు, మాటల్లో మంచి తనం మరో విధముగా మారుతుందనుకుంటాను. నిజమేనా పిన్నీ!" మంచం మధ్య, మోకాళ్లచుట్టూ చేతులు చుట్టి కూర్చున్న కౌసల్య తలపైకెత్తి, సుమిత్ర నడిగింది.

"మాటలతో జయించాలని చూచేవాళ్లు ఎదుటి హృదయాన్ని సరిగా అర్థంచేసుకోలేరు. అటువంటప్పుడు, నీవు నిర్ణయించుకున్న మంచితనం మరో విధంగా ఎవరి విషయంలో మారిందీ చెప్పకూడదూ!" సుమిత్ర సమాధానం ఎదుటికాళ్లకు బంధాలువేసినట్లు ఫీలయింది కౌసల్య.

"సహృదయులయితే ఎదుటివాళ్ళను అర్థంచేసుకోవడం నేర్చుకుంటారు." మంచంమీదనుంచిలేచి, సుమిత్ర కూర్చున్న సోఫాలో ప్రక్కగావచ్చి చతికిలబడింది.

"నీ మనసులో భావానికి సహృదయంఉంది భక్తి శ్రద్ధలు లేకపోవుటవల్ల, ఆ భావానికి గౌరవం దక్కడంలేదు."

సుమిత్ర, తన మనసులో విషయాన్ని తేలిగ్గా బయటకులాగి, అర్థంచేసుకొని, డొంక తిరుడుగా సమాధానం చెబుతుందని కౌసల్య అనుకుంది. తను మాత్రం బైటకు తొణకలేదు. నిండుకుండలాగ ప్రవర్తించింది.

"రాయికి ప్రాణంలేనపుడు, భక్తి ఎట్లా సంభవిస్తుంది?"

"రాయికి ప్రాణంలేకపోయిన, ప్రతిరాయిరప్పకు వంగి వంగి ఎందుకు నమస్కారాలు చేస్తున్నాం? ఆ రాయిమీద ఉన్నభక్తివల్లకాదు. ఒకప్పుడు సజీవంగాఉన్న ఆ రాయిలోని మంచితనానికి, ఇప్పుడు మనమంతా భక్తులమయ్యాము. ఇవన్నీ నన్నడిగి తెలుసుకొనేబదులు, ఇంట్లో మాష్టార్ని అడిగి తెలుసుకోవచ్చుగా?"

పరోక్షంగా ఎవర్ని గురించి ఉద్దేశించి, నిర్దిష్టంగా విమర్శించాలని అడుగుతుందో ఆమె నిర్మించుకున్న నిర్ణీత పరిధిల్లో సుమిత్ర యిరుక్కోనలేదు. కౌసల్య మాటల్లో అంతర్యాన్ని, ఇట్టే పసికట్టింది. ఆడదాని హృదయం ఆడదే తేలిగ్గా తెలుసుకోగల్గుతుందుగాని, మగవాడేకాదు — సృష్టించిన విధాతకూడ తెలుసుకోలేదు.

అతి శ్రద్ధగా వింటున్న సుమిత్ర మాటలు కౌసల్యకు యిష్టాన్ని కల్గించలేకపోయాయి. అనుకూలంగా సమాధానం వస్తుందని ఆశించిన ఆమెకు ప్రతికూల వాతావరణం మిగిలింది.

"పిచ్చిపిల్ల! మంచికి గౌరవం ఇచ్చినపుడు మన జీవితాలు సుఖంగా జరిగిపోతాయి. ఎవర్నైతే అపార్థంచేసుకొని, దూరంగా మసలుతున్నావో, వారి హృదయాన్ని అవగాహనం చేసుకొని దగ్గరగా కలవడానికి ప్రయత్నంచేయి."

"తప్పుచేసినట్లు తప్పించుకొని తిరుగుతే, ఎవరది తప్పంటావు?"

"అనుకున్నవాళ్ళది."

కౌసల్య ఉలిక్కిపడింది. కోపంవచ్చింది. సుమిత్ర నవ్వుతోంది.

"అయితే తప్పంతా నాదే నంటావు." తనకు తానే స్వయంగా పట్టుబడిపోయింది.

"దొరికిపోయావు. అనవసరంగా ఇతరులను నిందిస్తే, నిజం ఎప్పుడూ అబద్ధంకాదు. డబ్బుతో విషయాన్ని కొనుక్కోనవు; అమాయకులు నిందుతులు కావచ్చును. ఆ పనిమాత్రం తలపెట్టవద్దు." కౌసల్య రెండు భుజాలుపట్టుకొని ఊపుతూ, వివర్ణమైన ముఖం లోనికిచూచింది సుమిత్ర.

"ఎవరండి దొరికిపోయింది ?"

గుమ్మానికి రెండువైపులా చేతులుఆన్చి, అచ్చటకువచ్చి నిలబడ్డాడు వెంకట్రావు.

కౌసల్య అచ్చటనుంచి మెల్లగా జారిపోయింది.

"వెళ్ళిపోతున్నావేం ?" పిన్ని పిలుస్తున్నా, విన్పించుకోనట్లు, జవాబివ్వకుండా వెడలిపోయింది కౌసల్య.

"ఎప్పుడువచ్చారు? వచ్చేముందు ఉత్తరమయినా వ్రాయలేదు!" వెంకట్రావు లోపలికి ప్రవేశించాడు.

"మధ్యాహ్నంవచ్చాను. మీరప్పుడే కాలేజికి వెళ్ళారని చెప్పారు."

"మామయ్యగారు రాలేదనుకుంటాను."

"అక్కయ్యకు అస్వస్థతగాఉంటే, అనుకోకుండా రావలసివచ్చింది. మొన్నేగా ఇచ్చటకువచ్చి వెళ్ళింది. చదువు బాగా సాగుతుందా ?"

"ఇబ్బందులుకల్గనపుడు, అన్నీ సక్రమంగానే జరిగి పోతవి. మామయ్య మంచితనం నన్ను తిరిగి మనిషిగా చేసింది. నిరాధారుడ్నయిన నాకు నీడ చూపించారు. నిర్విచారంగా గడచిపోతుంది జీవితం."

"అదృష్టవంతుడివి. మంచి ఎప్పుడూ మంచినే వెతుక్కుంటుంది. మంచిగాఉండి మంచిపేరు సంపాదించగలవని ఆశ ఈ ఇంట్లో అందరికిఉంది."

"అందర్ని మెప్పించడం మీరనుకున్నంత తేలిక కాదు."

"అయితే ఎవరో ఒకరు నీ మార్గంలో అడ్డుగా నిలబడి ఉండాలి. కష్టపెట్టుకుంటున్నావా బాబూ!"

"నా కష్టంతో నాకు బాధలేదు. నావల్ల మరో కరికికష్టంకల్గినపుడు బాధపడాలి."

"ఎంత మెత్తని హృదయం ! నిన్ను బాధపెట్టేది నీ మంచితనం ఎప్పుడూ కాదు. కోపంగా సమాధానం వచ్చినపుడు, మనంకూడా కోపంగా ప్రవర్తించ కూడదు. సహనం, సౌజన్యం, సరళభావం అవసరం. మనంకూడా కోపంపెంచుకొని చిర్రుబుర్రుమంటే మానవత్వానికి దూరంకావలసి ఉంటుంది."

"సహనం, ఓర్పు, క్షమ ... ఇవన్నీ నన్నింత కాలంవరకూ బ్రతకనిచ్చాయి. ఆ వెలుగులోనే నా జీవితం వికాసవంతం అవుతుందికాని ..."

"తర్వాత సంగతి అర్థమయింది."

"మీరైనా ఆ మాత్రం అనుగ్రహించి మాట్లాడుతున్నారు; వినదలచుకోలేదని కసరకుండా దయ చూపుతున్నారు."

"హృదయమిచ్చి మాట్లాడితే, ఎదుటివారుకూడా హృదయమిచ్చి మాట్లాడుతారు. ఒకవేళ మాట్లాడక పోయినా కనీసం రెండోసారి ప్రయత్నమయినా చేస్తారు."

"ఆ ప్రయత్నం ఎన్నిసార్లయినా జరగకపోతే."

"వాళ్లను నిందించి ప్రయోజనంలేదు. నా కొడుకు దుర్మార్గుడని, కన్న కడుపును కత్తితోపొడచి చంపుతానా ? నా అనుబంధం అవివేకికావచ్చు. అంత మాత్రంతో నా నోటినుంచి ఆ సంబంధాన్ని చులకన చేయలేను. అటువంటివాళ్ల మనస్తత్వాలను మార్చాలి, మంచిని గ్రహించేటట్లు చేయాలి."

"ఎత్తునుంచి చూచేవాళ్లకు పల్లం, పల్లంగానే కన్పిస్తుంది. అటువంటప్పుడు మీరనుకున్నది జరగడం కష్టం."

"మనం ఉన్నది ఎత్తని భ్రమపడుతున్నాం. గట్టిగా గాలివీస్తే, ఎత్తున్నున్న వాళ్లంతా పల్లానికి రావలసిందే !

"వాదనకు విరామం అంటూ ఉండదు. అసలు విషయం మరచిపోయాను. అత్తమ్మగారు మిమ్మల్ని పిలవమని చెప్పారు."

వెంకట్రావు అతని గదిలోనికి వెళ్ళిపోయారు. సుమిత్ర క్రిందకు దిగిపోయింది.

"రాజమండ్రి రేపు వెళ్లక తప్పదంటున్నారు. అచ్చట పదిరోజులయినా ఉండవలసి ఉంటుందేమో! నీవువస్తే, కొంచెం ధైర్యంగా ఉంటుంది" సుందరమ్మ చెల్లెల్నిచూచి అంది.

"సరే! వారికొకకార్డువ్రాస్తే మంచిది"

"కార్డు వ్రాయకపోతే, వాళ్ల బావయ్య మరదల్ని మాయంచేశాడని మా తమ్ముడు అనుకోడుటే!" సుమిత్ర మాటకు అడ్డుగా నిలబడి, గుమ్మంలో కాలు పెడుతూ అన్నాడు కౌసల్య తండ్రి వీరభద్రయ్య.

"చూడవే! బావకు వసంతాలునిండినా పరిహాసం పోలేదు."

"నాన్న! పిన్ని మిమ్మల్ని ఏమంటుందో విన్నారా?" కౌసల్య హసించింది.

"అవునమ్మ! ఈ రోజుల్లో బావలు మరదళ్ళకు లోకువ!" మూతిమీదపడుతున్న కోరమీసాలను ప్రక్కకుతోస్తూ, చిన్నగా నవ్వాడు.

"మీ వేళాకోళాలకేంగాని, రేపు ప్రయాణానికి మంచిదని ఆచార్యులుగారు చెప్పారు."

"అయితే తాళాలు ఎవరిచేతికీయాలి?"

"అమ్మాయి ఉందిగా?"

"ఇంట్లో మగదిక్కు ఉండగా, వాడికెందుకీయకూడదు?"

"మీ కిచ్చినట్లే ఉంటుంది."

"ఇంటి పెత్తనం అమ్మాయిమీద పడిందన్న మాట!" మేడమీదనుంచి క్రిందకువస్తున్న వెంకట్రావునుచూచి,

"ఒరేయి బాబూ! తాళాలు అమ్మాయిచేతి లోనికి వెళ్ళిపోయాయి. అవసరమొస్తే డబ్బు అడిగి తీసుకుంటూఉండు. అసలే భయస్థుడివి." భద్రయ్య పలికాడు.

"ఆ విషయంలో బాబు ముందే జాగ్రత్తపడి ఉంటాడు." సుమిత్ర అంటుంటే సుందరమ్మ మరి యొకవైపుకి ముఖంత్రిప్పి, మౌనంగా కూర్చుంది. కౌసల్య విసుగ్గా అచ్చటనుంచి వంటింట్లోనికి వెళ్ళి పోయింది.

♦ ♦ ♦

వీరభద్రయ్య భార్యను రాజమండ్రి తీసుకొనివెళ్ళి, రెండురోజులయింది. సురక్షితముగా చేరుకున్నట్లు, సుందరమ్మ కులాసాగా వున్నట్లు ఉత్తరం వచ్చింది.

భోజనంచేసి మేడమీదకు వచ్చిన వెంకట్రావుకి, నిద్రపోతున్న శారద కన్పించింది.

"మొద్దునిద్ర. పరీక్షలు దగ్గరకు వస్తున్నాయి. కాస్సేపు చదువుకోకూడదూ!" అచ్చటకు వచ్చిన కౌసల్యను చూడకుండా కౌసల్య చెల్లెలిని లేప బోయాడు.

"ఇవ్వాళ చదువుకోవద్దని నేనే చెప్పాను. దాన్ని లేపడం అనవసరం." కౌసల్య కటువుగా అంది.

"బాగుపడుతుందనే ఉద్దేశ్యంతో లేపబోయాను. వద్దని నివారించిన తర్వాత విరమించుకుంటున్నాను."

అచ్చటనుంచికదలి, మెల్లగా తన గదిలోనికి వెళ్ళి పోయాడు. శారదను లేపడంలో తన తప్పేముందని? తప్పులేకపోయిన తను చేస్తున్న ప్రతి పనికి అడ్డుగా నిలబడి ఆటంకపరచడమంటే ఆమె కిష్టం. ఎదురు సమాధానం చెబుతే వూరికనే ఉడికిలిపోతుంది. తోక త్రొక్కిన త్రాచుపాములాగ బుసలు కొడు తుంది. అటువంటి ప్రతికూల వాతావరణంలో యిమడటం ఎవరికైనా కష్టంగానే ఉంటుంది.

"బావా లెక్కరావటంలేదు. కాస్త చెప్పవూ!"

పలక బలపం పట్టుకొనివచ్చిన శారద, అతని ఆలోచనలన్ని చెల్లా చెదర చేసింది.

"ఎవరైతే పంపించారో, వాళ్ళనే చెప్పమని అడగకపోయావూ!"

ఎవరికైతే ఆ మాటలు వినిపించాలో, వాళ్ళకు వినిపించేలాగ అన్నాడు.

"తెలియకపోతే తెలియదని చెప్పక, తప్పించుకోవడం దేనికి" అతన్ని అవమానపరచాలని, కౌసల్య గట్టిగా గదిలోనుంచి అరిచింది.

"ఎవరు తెలియక పంపించింది తెలుస్తుందిగా! శారదా! ఇక్కడకు నిన్ను పంపించిందెవరు?"

"ఎవరూ పంపించలేదు. లెక్క తెలియకపోతే నేనే వచ్చాను."

"నిద్రపోతున్న నీవు, నీకు నీవే ఎవరుపంపకుండా వచ్చావుకదూ! నమ్మవచ్చునా?"

"అంత అపనమ్మకంగావుంటే, మాట్లాడకుండా పూరుకోవటం మంచిది శారదా! వచ్చేయిక ఎందుకక్కడ నిలబడ్డావు?"

శారద కోపంలో రెచ్చిపోతున్న కౌసల్యవంక చూచింది.

"పెద్దవాళ్ల మనస్తత్వాలబట్టి చిన్న పిల్లల మనస్తత్వాలు మారుతాయి - నిజాలు నేర్పడానికి బదులు, జయించాలనే అభిలాషతో చిన్న పిల్లల మనస్సులను మంచి నుంచి దూరంచేయడం తెలివితక్కువతనం; ఇది గ్రహించడంవల్ల ఉపయోగం ఉంటుంది."

"పాఠాలు నేర్చుకోటానికి నేనేమి పసిపిల్లను కాదు."

"పాఠాలు చిన్నపిల్లలేకాదు నేర్చుకొనవలసింది; కొన్ని సమయాల్లో పెద్దవాళ్లుకూడా నేర్చుకొనవలసి ఉంటుంది. ఈ విషయమైన అర్థంచేసుకోవడం ధర్మమేమో!"

వాళ్లిద్దర మధ్య జరుగుతున్న సంభాషణను శ్రద్ధగా వింటున్న శారదను దగ్గరగా కూర్చోపెట్టుకొని, లెక్కలన్నీ అర్థమయ్యేటట్లు సులువుగా చెప్పి పంపించాడు.

శారద వెళ్ళిపోయింది.

కౌసల్య కిక్కురమనకుండా పూరుకుంది.

వెంకట్రావు శూన్యంలో తలదూర్చి, ఆలోచిస్తున్నాడు. ఎదురుగుండా దీపం దేదీప్యమానంగా వెలుగుతోంది. కాని అతని కళ్లముందు నల్లని తెరలు ముంచుకుపడుతున్నాయి. భరించరాని ఏకాంతం. భయకంపితమైన అఘాతం, అర్థమవ్వని అంధకారం.

"అమ్మ నన్నెందుకిచ్చట వదలిపెట్టి వెళ్ళిపోయింది?" హృదంతరంలో ప్రశ్న.

"చావలేక బ్రతకడంకోసం." నిట్టూర్పు నెత్తాని దొంతరలను అందిస్తుంది మామయ్య ఇనుపపెట్టితాళం.

"పట్టు తప్పింది. మరొక ఆధారం చిక్కింది. కష్టమో, నిష్టూరమో దక్కిన కొమ్మను విడిచిపెట్టకు." ఆకలిజీవితంమీద దర్జాగా కూర్చుని కబుర్లుచెబుతోంది.

గతించిన నాల్గు సంవత్సరాల చరిత్ర తల క్రిందులుగా అతని ముందు కదిలిపోయింది. తండ్రి మరణాంతం, పెళ్లీడుకు వచ్చిన యిద్దరు కూతుళ్లు, చదువుకుంటున్న కొడుకు దిక్కులేని పక్షులయ్యారు. సంతాన సంరక్షణకోసం తల్లి హృదయం తల్లడిల్లి పోయింది. బ్రతకడం కోసం మార్గాన్ని వెదుక్కుంటున్న తల్లి హృదయం ఆనాడు ఎంత క్షోభించిందో, వెంకట్రావు కళ్లలో కదులుతున్న కన్నీరు చెబుతోంది. పుట్టింటివాళ్ళిచ్చిన రెండెకరాలు విక్రయించి, ఇద్దరి పిల్లల వివాహాలు వరకట్నాలిచ్చి జరిపించింది. కుమారుడు, తనూ మిగిలారు. కుమారుని భవిష్యత్తు జీవితం గురించి బాధపడుతున్నప్పుడు, వీరభద్రయ్య దేవుడులాగ కన్పించాడు.

"ఒక్కడేగా! మా ఇంట్లో ఉంటూ, చదువుకుంటాడు." వీరభద్రయ్య తల్లి దగ్గరన్న మాటలు జ్ఞాపకానికి వచ్చాయి.

"స్కూలు ఫైనలువరకు చదివితే ఏదో ఉద్యోగం దొరికితే వాడి దారి వాడు చూచుకుంటాడు."

కుమారుడ్ని వీరభద్రయ్యకు అప్పగించింది. "బాబూ! మీ మామయ్య ఎంత దగ్గరవారయినా మనం దూరపు వాళ్ళమే! డబ్బున్న వాళ్ల మనస్సులో మనం దూరంగా వుంచబడతాం. కలవారింట్లో కొత్తలో కొంచెం బాధగానే ఉంటుంది. జాగ్రత్తగా వాళ్ళకు అనుకూలంగా మసలుకుంటే అంతా అలవాటు అవుతుంది. వారికి కష్టమొచ్చే పనులు తలపెట్టకూడదు. మంచిగా ఉండి, మంచిపేరు సంపాదించు" తల్లి, కుమారుడ్ని హృదయానికి హత్తుకొని, కన్నీరు పెట్టుకుంది. ఆ కన్నీరు అతని కళ్ళలో కదిలిపోతోంది.

వెంకట్రావుకి దుఃఖం ఆగలేదు.

"అమ్మ!" అంటూ వెక్కి వెక్కి చంటిపిల్లవాడిలాగ విలపించాడు.

ఆ విశాల సౌధంలో...... ఆ కన్నీరు ఎవరికి కన్పించదు. ఆ విషాదం ఎవరికీ కన్పించదు.

మామయ్య మంచివాడే!

ఏం లాభం?

ఆ మంచి అంతా అత్తయ్య హృదయంలో తారుమారవుతోంది. మరొక రూపం ధరిస్తుంది, ఆ రూపం అతన్ని కష్టపెడుతుంటే, బాధపడటమంటే నేర్పుతుంది. అదే కౌసల్యకు కావాలి.

తల్లీ కూతుళ్లు నవ్వుతున్నారు.

మామయ్యకు అర్థం కాలేదు.

ఆ నవ్వులో సానుభూతి లేదు.

అనునయం అంతరించింది. అహం అధికమైపోయింది.

అంతా చీకటి

అనుకున్నదంతా కటిక చీకటి.

తెల్ల తెల్లగా తెల్లవారింది. మెల్ల మెల్లగా కళ్లు తెరచిన వెంకట్రావుకి ఎదురుగుండా కౌసల్య ప్రత్యక్షమయింది. అతఁడు త్రుళ్ళిపడ్డాడు. కల కాదని, వాస్తవికతని నిర్ణయించడానికి కొన్ని నిముషాలు పట్టింది. కన్నీటి మరకలుపడ్డ ముఖంతో, ఎర్రచారలు పడ్డ నేత్రాలతో, అతనికి తెలియకుండా తొంగి చూస్తున్న కౌసల్య అధరాలు అదిరాయి. వెంకట్రావు తల ఎత్తి ఆమె వైపుకి చూచేసరికి, ఆమె అచ్చట నుంచి తప్పించుకొని వెళ్ళిపోయింది. ఆమె కన్పించే వరకు చూచి, ఆమె తత్వాన్ని అర్థం చేసుకోలేక సతమత మవుతూ, మొహం కడుక్కొని కాఫీ త్రాగటానికి పడమటి గదిలోనికి వచ్చి కూర్చున్నాడు. ఎవరూరాలేదు. చాల సేపటివరకు చూశాడు. ఎవరూ కన్పించలేదు. వినుగెత్తి వెళ్ళిపోదామనే ప్రయత్నంలో శారద కన్పించింది. ఆమె చేతుల్లో ఏమీ లేవు. వెంకట్రావుకేమీ అర్థం కావడంలేదు. తనకుతాను స్వయంగా వెళ్ళి, 'భిక్షాందేహీ' అని అడిగే గతి పట్టిందనుకున్నాడు. ఆ సమయంలో సంఘటితమైన ఆ పరిస్థితికి అతనిమీద అతనికే జాలివేసింది. ఆకలి దహించుకుపోతుంది. చర చరా మేడమీదకు వెళ్ళిపోయాడు. టేబిలుమీద టిఫిను, కాఫీ పెట్టి ఉన్నాయి. కొంచెంసేపు నిశ్చేష్టుడై, నిమ్మదిగా ఫలహారాన్ని పూర్తి చేశాడు.

బట్టలు వేసుకొని, సావిడి గుమ్మందాటి బయటకు వస్తుండగా, లోపలినుంచి అతన్ని పిలుస్తున్న శబ్ధం విన్పించింది. వెనక్కి తిరిగాడు.

"ఆలస్యంగా వస్తే..." వంట మనిషీ నరసమ్మ మాట విన్పించింది.

"వడ్డన చేసేవాళ్లు ఎవరూ ఉండరనా! ఫర్వాలేదు. మీ అమ్మగారు కష్టమని అనుకోకాపని, నేను చేయడానికి నాకు తేలిగ్గా ఉంటుందని, అందుకు నేనేమి బాధపడనని మీ అమ్మగారితో చెప్పు."

వెంకట్రావు వెళ్ళిపోయాడు.

ఇవన్నీ వింటున్న కౌసల్యకు వళ్ళు మండిపోయింది.

"ఎంత నిర్లక్ష్యం!" పళ్ళు పట పట కొరుకుతూ జరగబోయేదాని గురించి ఆలోచిస్తోంది.

♦ ♦ ♦

వెంకట్రావు తిరిగి ఇంటికి వచ్చేసరికి, వీధి గుమ్మం తలుపులు వేసివున్నాయి. అప్పటికి చాల చీకటి పడి పోయింది. వీధిలో జనసంచారంలేదు. అక్కడక్కడ కుక్కలు తిరుగుతూ, మొరుగుతున్నాయి.

రెండు మూడు సార్లు వీధి తలుపులు తట్టాడు. ఎవరూ తీయలేదు. ఈ సారి ఉండ బట్టలేక గట్టిగా బాదాడు. కొంచెం సేపటికి నరసమ్మ తలుపుతీసి వెళ్లి పోయింది. తిరిగి తలుపులువేసి, మేడ మీదకు వెళ్ళి, మడత మంచం వాల్చుకొని నడుం వాల్చాడు.

"చిన్నమ్మగారు రేపు రాజమండ్రి వెళ్తారట." నరసమ్మ చెప్పుతూ వచ్చి, కొంచెం దూరంలో నిల బడింది. తన భోజనం సంగతి అడుగుతుందేమో అను కున్నాడు. అటువంటిదేమి జరగలేదు. తను అన్నం తినినా, తినక పోయినా ఆ యింట్లో ఎవరూ పట్టించు కున్నట్లు లేదు. చివరకు పని మనిషికికూడా అవసరం లేకుండా పోయింది. పాపం పనిమనిషేమి చేస్తుంది? దానికి డబ్బిస్తే, అది చెప్పినట్లు వింటుంది. అమ్మగారి చేతిలో కీలుబొమ్మ.

"అని మీ అమ్మగారు చెప్పమన్నారా?"...... వెంకట్రావు నవ్వుతూ నసిగాడు.

నరసమ్మ దగ్గరనుంచి సమాధానం లేదు.

"ఇంత అకస్మాత్తుగా ప్రయాణమయ్యారు. అంత అవసరమేమొచ్చింది చెప్పలేదా?"

"అదేమి నాకు తెలీదండి. వారు ఊరుకెళ్తా నన్నారు. అంత వరకే తెలుసు," అచ్చట నుంచి కదిలిన నరసమ్మను పిలిచి,

"బహుశా మీ అమ్మగారు వెళ్ళకముందే నేనే వెళ్లిపోవచ్చును. వారు వెళ్ళినా తిరిగివస్తారు. నా విషయంలో అటువంటిది జరగదు. ఈ సంగతి మీ అమ్మగారితో చెప్పు. చాల సంతోషిస్తారు" వెంకట్రావు అన్నాడు.

నరసమ్మ నిష్క్రమించింది.

శారద కళ్ళు నలుపుకుంటూవచ్చి, మంచంమీద కూర్చుంది.

"ఇచ్చట కెందుకు వచ్చావు. గదిలో భయమేస్తుందా?" ... భయమనే శబ్దం వత్తి పలికాడు.

"మధ్యాహ్నం ఇంటికి ఎందుకురాలేదు? అన్నం ఎక్కడ తిన్నావు?" వెంకట్రావు ముఖం మీదకు వంగి, గుచ్చి గుచ్చి ప్రశ్నలు వర్షం కురిపించింది.

"ఆకలి వేయలేదు. అందుకురాలేదు" నవ్వుతూ సమాధాన మిచ్చాడు.

"అంతా వట్టిది. కోపంవచ్చింది కదూ!"

"కోపం వస్తే కడుపు నిండుతుందా?"

"నిజం చెప్పు బావా! నీవు మధ్యాహ్నం అన్నం తిన్నావా?"

"తినకపోతే ఏం చేస్తావు?"

"అక్కయ్యతో చెప్తాను."

"చెప్పి"

"అన్నం వడ్డిస్తాను."

"వీపుమీద వడ్డించవుగదా!"

"అన్నం తినకపోతే ఆ పనికూడా చేయవలసి ఉంటుంది."

"ఆకలి వేయకపోతే..."

"అక్కయ్య వడ్డిస్తే అదే వేస్తుంది."

"సరేగాని, రేపు మీ అక్కయ్యతోబాటు నీవు కూడ రాజమండ్రి వెళ్తున్నావా?"

"ఊహుఁ... నేను వెళ్ళను."

"మరి ఇంట్లో ఎవరూ ఉండరుగా!"

"మా బావ ఉంటాడు."

"మీ బావకూడ వెళ్ళిపోతే..."

"మా బావతో వెళ్తాను."

"మీ అక్కయ్యతో వెళ్ళకపోతే, నిన్నేంచేస్తుందో తెలుసా? పేకావారి అబ్బాయికిచ్చి పెళ్లిచేస్తుంది."

"ఇద్దరు మాటలు వింటున్న కౌసల్య లేచి, అప్రయత్నంగా అచ్చటకువచ్చి నిలబడేసరికి, ఇద్దరూ గప్‌చిప్‌గా ఉండి పోయారు.

"ఇంత అర్ధరాత్రి వస్తే, ఇంట్లో ఎవరూ కనిపెట్టికొని ఉండలేరు."

వెంకట్రావు కౌసల్య మాటలు వింటూ, లేచి కూర్చున్నాడు.

"కనిపెట్టుకొని ఉండమననప్పుడు, అనవసరంగా బాధపడటం దేనికి?"

నమ్రతతో నీళ్ళు నమిలాడు.

"మధ్యాహ్నం ఇంటికి రానపుడు రావడం లేదని ముందే కబురుచేయకూడదూ!"

"పొరపాటు జరిగిపోయిందని ఒప్పుకుంటున్నానుగా! దూరదేశం నుంచి స్నేహితుడొకడు వచ్చాడు. అతనితోబాటు అనుకోకుండా నాళ్ల ఊరు వెళ్ళవలసి వచ్చింది. ఇంటికివచ్చి చెప్పడానికి టైము లేకపోటంవల్ల రాలేక పోయాను."

ఎంతో ఓర్పుతో చెపుతున్న వెంకట్రావు మాటలు ఆమెను అచ్చటనుంచి కదిలించి వేశాయి. హృదయాన్ని కరిగించి వేశాయి.

"బావా! అక్కయ్య అన్నం తినలేదు. నిద్రపోలేదు. నీకోసం ఎదురు చూస్తూంది." కౌసల్యకు విన్పించకుండా వెంకట్రావు చెవులో చెప్పింది.

అతని హృదయం స్పందించింది.

అనూహ్యమైన అనుబంధం అవతరించింది.

గబగబా కౌసల్య ఉన్న గదిలోనికి వెళ్ళాడు. కూర్చున్న కౌసల్య, అతన్ని చూచి, లేచి నిలబడింది.

"మిమ్మల్ని చాల శ్రమ పెడుతున్నాను. ఇంత ఆలస్యంగా అన్నం తింటే ఆరోగ్యం పాడవుతుంది. ఆరోగ్య విషయంలో అశ్రద్ధ చేస్తే, పెద్దవాళ్లమయిన తర్వాత బాధ పడాలి."

"నా గురించి మీ రెవురు బాధపడనవసరంలేదు. నేను భోజనం చేశాను. పస్తులపడవలసిన అవసరం నాకు లేదు." చాల తెలివిగా పొరపాటు కోసం, అబద్ధమాడినందుకు వెంకట్రావుకి నవ్వొచ్చింది. బయటకు నవ్వితే మరీ ఉడికిలి పోతుందని, నవ్వును ఆమెకు కన్పించకుండా చేశాడు.

"స్వతసిద్ధంగా మీకో మంచి స్వభావం ఉందని, మీకోపం ఇతిమిద్ధంగా చెపుతోంది."

వెళ్లిపోతున్న అతని శూన్యం వైపు ఆశగా చూస్తూ తలుపులు వేసుకుంది.

♦ ♦ ♦

సెకనులు... నిమిషాలు... గంటలు... రోజులు కాలం కళ్ళలో వికాసంగా వినోదంగా కదిలిపోతుంటే లోకం కళ్లలో విషాదంగా విలాసంగా నడిచి పోతున్నాయి.

వీరభద్రయ్య దగ్గరనుంచి రెండవ ఉత్తరం వచ్చింది.

చిరంజీవి వెంకట్రావుకి దీవనలు...

మనం అనుకున్నట్లు ఏదీ జరగదు. మీ అక్కయ్యకు తగ్గిపోతుందని ఆశపడి, రాజమండ్రి తీసుకొని వచ్చాము. తగ్గుముఖంలేదు. నీరసంగా ఉంటుంది. శరీరంలో రక్తంలేదు. లేవలేని పరిస్థితిలో ఉంది. కొంతకాలంవరకూ హాస్పటల్‌లో ఉంచడం మంచిదని డాక్టరు చేప్పారు. అంచేత ఇంటికి తీసుకొని రావడం లేదు. మీరెవరూ అధైర్య పడకండి. అమ్మాయికీ ఉత్తరం చూపించవద్దు. వాళ్ళమ్మకు కాస్త సుస్తీ చేస్తే చాలు, వూరికినే బాధపడుతుంది. ఉత్తరం వచ్చిందని అడిగితే కులాసాగా ఉందని చెప్పు.

రెండు మూడు రోజుల్లో తీరిక చేసుకొని ఒకసారి

అచ్చటకు వచ్చి, వివరాలన్నీ వయనంగా చెబుతాను.

ఇట్లు
వీరభద్రయ్య

వెంకట్రావు జాబు వ్రాసి, బయటకు వెళ్ళిపోతుంటే, రామారావు, అతని భార్య అండాళ్ ఎదురయ్యారు. నివ్వెరబోయి, తెల్ల ముఖంపెట్టి చూస్తున్న వెంకట్రావుని, రామారావు కౌగిలించుకున్నాడు.

"బలేవాడివిరా ! వచ్చే ముందు ఉత్తరం వ్రాయకూడదూ !" ఇంకా ఆశ్చర్యపడుతూ రామారావు కళ్లలోనికి చూశాడు.

"ఉత్తరం వ్రాస్తే, ఇంత సస్పెన్స్ ఉండదు. సడనుగా వస్తే నీ వెంత సంతోషిస్తున్నావో చూశావామరి."

"మా చెల్లమ్మ ఇంత చిక్కిపోయింది. ఏం అమ్మా ! మావాడు పూర్తిగా ఆఫీసు గొడవల్లో నిన్ను మరచి పోతున్నాడా ?"

"గుమస్తా గాళ్ళం - గుమాస్తాల భార్యలు అంత కంటె లావవుతే, ఆఫీసర్ల భార్యలు గొల్లున గోల పెట్టరూ ! సరేగాని... ఈ ఇంట్లో నీవుతప్ప, 'నా' అనే వారెవరూ లేరా ?"

"అత్తమ్మకు జబ్బుచేస్తే రాజమండ్రి తీసుకొని వెళ్ళారు."

"మాకు సెలవు ఇప్పిస్తావా, బండికి వేళయింది."

"గుమ్మంలో కాలు పెట్టేవో లేదో అప్పుడే వెళ్లి పోతానంటావేం !"

"నీ ఇల్లయితే ఒకరోజుకాదు, ఎన్ని రోజులైనా తిష్టవేసి కూర్చుంటాము. పైగా ఈ ఇంట్లో నీవు తప్ప ఎవరూ లేరంటున్నావాయె !"

"ఈ ఇల్లు వారిదిగా ఎందుకు భావించ కూడదు. మీరీ రోజు వెళ్ళడానికి వీల్లేదు." అప్రయత్నంగా అనుకోకుండా అచ్చట ప్రత్యక్షమయిన కౌసల్యను చూచి అంతా ఆశ్చర్య చకితులయ్యారు.

అండాళును లోపలకి తీసుకొని వెళ్తున్న కౌసల్యను చూచి,

"ఎవర్రా ఆ అమ్మాయి !" రామారావు అడిగాడు.

"మా మామయ్య కూతురు... కౌసల్య..."

"ఉయ్యాల్లో పిల్లను పెట్టుకొని, పిల్లకోసం వూరంతా తిరిగిందట ఒక ఇల్లాలు. ఇంత చక్కని చందనపు బొమ్మ వుండగా, మీ అమ్మ మరొక సంబంధం ఎందుకు చూడవలసి వచ్చింది ?"

"మా అమ్మ నాకోసం మంచిపని చేస్తుంది."

"అయితే మీ మామయ్యకు ఈ సంబంధం ఇష్టం లేదా ?"

"అనవసరంగా ఆశలు కల్పించుకొని అడియాశ పడడంకంటే, అందని ఆశలను అంతంచేయడం మంచిది. భోజనం టైము అయిందిలే !" రామారావుని తీసుకొని మధ్య సావిట్లోనికి వచ్చేసరికి కౌసల్య మాటలు విన్పించాయి. వెంకట్రావు కన్పించకుండా అచ్చట నిలబడి శ్రద్ధగా వింటున్నాడు.

"బావకు గుంటూరులో సంబంధం కుదిరిందని విన్నాను. నిజమేనా వదినా !" అండాళ్ ని అడిగింది కౌసల్య.

అండాళ్ మాట్లాడకుండా కూర్చుండి పోయింది.

"ఒకవేళ నిజమయితే అది జరగడానికి వీల్లేదు." బాధతో అంటున్న ఆమె మాటలువిని, నిర్విణ్ణురాలై చూచింది అండాళు.

"సంబంధం ఇంకా నిశ్చయం కాలేదు. డిప్యూటి కలక్టరుగారి అమ్మాయి... పేరు కుసుమ, చామన ఛాయ, సన్నగావున్నా, చురుగ్గా పనులు చేస్తుంది. సంప్రదాయ కుటుంబం. నల్గురితో మంచి గౌరవ మర్యాదలున్న వారు......"

"చాలు వదినా...అయితే ఆ సంబంధానికి బావ ఇష్టపడ్డాడా?" గొంతులో జారుముడిపడింది.

"ఆ విషయం నాకు తెలీదు. వాళ్ళ ఫ్రెండుకి చెప్పి ఉంటారు."

"వడ్డన చేస్తాను." అంటూ నరసమ్మ వచ్చి, ఉత్సాహమైన సంభాషణను వింటున్న వెంకట్రావుని నిరుత్సాహ పరచింది.

అంతా, భోజనాలకు లేచారు.

ఆ రోజంతా ఉండి రామారావు ఆండాళ్ వాళ్ళ ఊరు వెళ్ళిపోయారు.

♦ ♦ ♦

మూడు సంవత్సరాల-అనంతరం.

"ఏమండీ! ఇప్పటికైనా కౌసల్య హృదయాన్ని అర్థం చేసుకోగలిగారా!" నిద్రపోతున్న వెంకట్రావును లేపి అడిగింది కుసుమ.

"అర్థమయింది. అదిప్పుడు లక్షాధికారి భార్య... ఇద్దరు ఆడ పిల్లల తల్లి." కళ్ళు తెరచి, మంచంమీద లేచి కూర్చున్న వెంకట్రావు చిన్న నయనాలలోనికి తొంగి చూచింది కుసుమ.

బాధను వ్యక్త పరుస్తుంది అతని అంతర్యం; గాథను చిత్రించు కుంటుంది ఆమె అంతరాత్మ.

# తెలుగు జండా

శ్రీ మండ రామారావు

తెలుగువారలు తెలుగువీరులు
వెలుగులను వెదజల్లవలెనోయ్
'తెలుగుజండా' కీర్తిదిశలకు
తెలిసి తలలూపించవలెనోయ్—

గతం గొప్పలు ఆపి ప్రస్తుత
కార్యములపై లక్ష్యముంచుము
సతం ఒప్పుల కుప్పవై నీ
కర్తవ్యం నెరవేర్పవోయ్—

మనస్పర్ధలు జాతిభేదం
మాయహింసా భావములను
వదలిముందుకె సాగిపదవోయ్
ప్రగతిమార్గం చూపి పోవోయ్—

మనసు నిర్మలమైన జాతికి
మంచి తప్పక కల్గునోయ్
దేశమంతా బాగుపడునోయ్
దేవురింతలు బాయునోయ్—

ఆదర్శమన్నది ముందునిడుకొని
పరులమేలుకు పాటుపడుతూ
అంధకారం తరుమవలెనోయ్
సంఘ పురోగతి సాధించవలెనోయ్ —

విద్యలున్న ధనం కలదోయ్
ధనంకల్గిన బలం కలదోయ్
ధన బలమ్ముల కూర్చుకొని ఏ
దైననూ సాధించగలవోయ్—

జగతివృక్షం శాఖలేనోయ్
జనత అంతా ఒక్కటేనోయ్
మనసులన్నీ కలసియుంటే
మానవత పెంపొందునోయ్—

అపుడె నిజముగ దేశమందున
కవితలన్నవి విరాజిల్లును
కళలు కలకలలాడు జాతికి
కలుగు చైతన్యం—

ఆంధ్రసోదర మేలుకొనుమా
ఆంధ్రసోదరి కోలుకొనుమీ
మీ శక్తి యుక్తులు తేటపడగా
మేలుపొందుడు దీటుగా—

# అదృష్టవంతులు

శ్రీ నండూరు సుబ్బారావు

సలక్షణంగా గోపాలం పెళ్ళి ముగిసింది. నేను, ప్రసాదు తిరుగు ప్రయాణానికి బెడ్డింగు బిగించే లోపల గోపాలంవచ్చి మా ప్రయాణం వాయిదా వేశాడు. అది పల్లెటూరు అవటంచేత సాయంకాలం పొలాలకేసిషికారు వెళ్ళాం. పొలిమేర గట్టుమీద కూర్చుని పెళ్ళి సంగతులు మాట్లాడు కొంటున్నాము. హఠాత్తుగా మాట్లాడం ఆగి గోపాలం 'నా పెళ్ళి విషయం చూస్తూవుండే నాకే ఆశ్చర్యం వేస్తోంది' అన్నాడు. అసలు విషయం మాకు తెలియదుగా అంచేత వాడే మొదలు పెట్టాడు "పూర్వం సీతను నేను ప్రేమించాను. ప్రతిరోజు స్కూలుకు కలసి వెళ్ళేవాళ్ళం. కాలేజీలో మొదటి సంవత్సరంకూడ యిట్లాగే జరిగింది. కాని ఖర్మ వశాత్తు వాళ్ల నాన్నను మా వూరినుండి బదిలీ చేయటంవల్ల ఆమె దూరమయింది. ఆ రోజు నేను వూళ్లోలేను. ఉంటే అడ్రస్సు ఇచ్చేదే. నాకు బి. ఏ. అయిపోవటంతో పెళ్లి సంబంధాలు మీద సంబంధాలు చూశాను. కాని మనస్సంతా ఆమె మీదే వుండేది. చివరికి మా నాన్నతో నీకు బాగున్న పిల్లనే చేసేయి అంటే నాలుగు రోజులలో మా నాన్న స్నేహితుని ద్వారా యీ వూరి పిల్లను చూచి ముహూర్తం పెట్టించాడు. సరే...... తీరా పెళ్లి పీటలమీద కూర్చున్న తర్వాత చూసేటప్పటికి ఒక్కసారి యెగిరి గంతేద్దామనిపించింది. (వీట్ని చూసే టప్పటికి మాకు నవ్వు వచ్చింది) ఎందుకంటారేమో...... "పూర్వం నా ప్రియురాలేరా యీమె" అన్నాడు. అమాంతంగా కావిలించుకొని అదృష్ట వంతుడివిరా అన్నా నేను. "ఒరేయ్ గోపాలం! నీ కంటే వీడే గొప్పవాడురోయ్. నాకు వాడు పెళ్ళి సంగతి రైల్లో సగం చెప్పాడు!" అని నా వైపు తిరిగాడు ప్రసాదు. గోపాలానికి కోపం వచ్చింది నా సంగతి చెప్పలేదని. ఇకేం...... మళ్లీ మొదలుపెట్టానా పెళ్ళిగాథ......

"అది ఎండా కాలం. ఎండలు విపరీతంగా కాస్తూన్నాయి. నేను, ప్రసాదు, ఆంజనేయులు మా యింటి ఎదురుగా వుండే మర్రి చెట్టు క్రింద కూర్చుని పేపరుకోసం ఎదురు చూస్తూ వున్నాము. ఆ రోజే మా S. S. L. C. పరీక్షా ఫలితాలు పడే రోజు. ఇంతలోకే పేపరు వచ్చింది కానీ అసలు మా స్కూలు మొత్తం పేర్లు పడలా. మా ఫలితాలు ఆపు చేయబడ్డాయని క్రింద వ్రాసి వుంది. ఇక నిరాశహృదయంతో ప్రతిరోజు పేపరు చూడ్డం ఇంకా ఫలితాలు పడకపోటం జరుగుతూవుంది. దాదాపు నెల రోజులు జరిగింది యీ విధంగా. కాలేజీలు అన్నిచోట్ల తెరిచారు. ప్యాసయిన వాళ్ళు సంతోషంతో కళాశాలలలో చేరటానికి వెళుతున్నారు. బహుశా! ఆ రోజు మాకు పర్వదినం లాగుంది! పోస్టాఫీసుకు పెద్ద పార్సిల్ వచ్చింది. మెల్లిగా బంట్రోతు హెడ్మాష్టరుకిచ్చాడు. ప్యాసయినవాళ్ళ పేర్లు చదివాడు. మొత్తంమీద మనం మంచి మార్కులతో ప్యాసయినాను.

గబ గబా మూట ముల్లే సర్దుకొని బెజవాడలో యిల్లు అద్దెకు తీసుని కాలేజీలో చేరా. పాఠాలవి జరగడంలేదు. ఈ విధంగా పదిహేను రోజులు గడిచాయి...... మా యింటి ఎదురుగాడాబాయింట్లో ఒక అమ్మాయి వుండేది. ఒక రోజున హఠాత్తుగా ఆ అమ్మాయి కళ్లు నా కళ్ళు కలుసుకున్నాయి. అదే మా యిద్దరి ప్రేమకు నాంది అనుకుంటా. రోజు రోజుకు వృద్ధి అవుతోంది మా పరస్పర ప్రేమ. మధురమైన రాత్రింబవళ్లు రెండు నెలలు జరిగాయి. ఆ అమ్మాయి

పేరు శారద. ఇప్పుడు నన్ను చూచి శారద, శారదను చూసి నేను నవ్వుకోటం జరుగుతూవుంది.

ఆ రోజు గురువారం మధ్యాహ్నం నుంచి నాకు కాలేజిలేదు. పెందలకడే యింటికి వచ్చా. శారదా వాళ్ళ యింటికేసి చూశా. ఏదో లేసు అల్లుకోంటోంది. చిన్న దగ్గు దగ్గేటప్పటికి తలయెత్తి చూసి చిరునవ్వు నవ్వింది. మెల్లగా లోపల పుస్తకాలు పడేసి బయటికివచ్చి నుంచున్నా. ఎన్నిరోజులనుంచి కనిపెడుతోందో మా అమ్మ యింక వుండ బట్టలేక "అబ్బాయీ! నువ్వు ఆ అమ్మాయివంక, ఆ అమ్మాయి నీ వంక చూసి నవ్వుకుంటున్నారు. ఆ అమ్మాయి పెళ్ళికాని పిల్ల. అమ్మాయివంక చూడటం చాల తప్పు. మనం గౌరవంగా బ్రతుకుతున్నాం. వాళ్ళ వాళ్ళు గొప్పవాళ్ళు. తెల్లవారి లేస్తే ఒకరి మొఖాలు వొకరు చూచుకొని తిరగాలి. ఎదయినా మాట వచ్చిందంటే కష్టం. జాగ్రత్త! యింక నీయిష్టం తరువాత యేం అనుకున్నా లాభంలేదు" అనేటప్పటికి గోరుచుట్టుపై రోకలిపోటు పడ్డట్లయింది మనకు - కాని అమ్మ పలుకులు అమర సందేశాలుగా కన్పించాయి. వెంటనే ఆ అమ్మాయి వంక చూడకూడదు అనుకున్నా. ఏమయితేనేం రెండు రోజులు ఆ వైపు తలయెత్తి చూడలా. కాని మనస్సు మాత్రం విపరీతంగా ఆ వైపుకు లాగుతోంది. కాని ప్రేమ వైపే మొగ్గు చూపింది మనస్సు. అమ్మ చూడకుండా శారద వంక చూస్తూ నవ్వుతూ ఆనందించే వాడిని. ఈ విధంగా ఆరు నెలలు ఆనంద డోలికలలో మునుగుతూ తేలుతూ గడిచాయి, 'కాని భగవంతుడికి కూడ మా ప్రేమంటే అసూయ కల్గింది.' ఒక రోజున మా యింటి యజమాని హఠాత్తుగా చనిపోయాడు. ఆ రోజు మంచిది కాదు. అంచేత యిల్లు ఖాళీ చేయవలసి వచ్చింది. ఎంత కష్టం వచ్చిందిరా అనుకుంటూ కాలేజీకి వెళ్ళా. సాయంకాలానికి యింటికివచ్చేసరికి యిల్లంతా ఖాళీ అయింది. ఒక్కసారి శారదయింటికేసి చూశా. గుమ్మంలో నిలబడివుంది. అకస్మాత్తుగా కళ్ళంబడి నీళ్లు తిరిగాయి. ఎలానో తమాయించుకొని చిరునవ్వు నవ్వా! సమాధానం విచారకమైన చిరునవ్వు.

కొత్త యింట్లో చాలా హుషారుగా వుంది. తరచుగా శారద యింటికేసి వెడుతూ వుండేవాడిని. సంక్రాంతి శెలవలిచ్చారు కాలేజీకి. ఆ రోజు భోగి. శారద పట్టుచీర కట్టింది-చక్కని వాలుజడవేసి ముని గోరింట పూలచెండు తల్లో సింగారించింది. చెవులకు బుట్ట లోలాకు లున్నాయి. అప్పుడే వాళ్ళ యింటి మీదుగా వెడుతున్నా. గుమ్మాలకు కుంకం బొట్లు పెడుతోంది. ఒకసారి అలా ... చూశా. ఆనందానికి అంతులేదు. ఒక్కసారి పలుకరిద్దామా అనిపించింది. కాని అప్పటికా భాగ్యం నోచుకోలేదనుకున్నా మనస్సులో. ఇంతలోకే యిటువైపు తిరిగి చిలిపిగా నవ్వింది. కొంపదీసి నా భావం అర్థం చేసుకుందా అని నవ్వుకుంటూ వెళ్ళిపోయా. రెండేళ్ళ కాలచక్రం గిఱ్ఱున తిరిగింది. పేపరులో నా నంబరు ప్రథమ శ్రేణి అలంకరించింది. ఇంక నా సంతోషం కట్టలు తెగి మైదానం మీదుగా ప్రవహిస్తోంది. హఠాత్తుగా శారద జ్ఞాపకం వచ్చింది. శుభవార్త యింట్లో చెప్పి శారద యింటివైపు దారి తీశా. నేను వస్తూవున్నానని తెలుసుకుందో యేమో స్వాగతం యివ్వటానికి నిల్చింది. మధ్యాహ్నంవేళ బజారులో నరమానవుడులేడు. నేను తలయెత్తి చూశా కాని నవ్వకుండా నడుస్తున్నా. వాళ్ల గుమ్మం వరకువచ్చా. ఇంతవరకు నాకు శారదకు మధ్య ఏలాటి మాటలు జరగలా. హఠాత్తుగా 'ఏమండీ! మా అన్నయ్య కనుపించాడా?' అంది శారద. తబ్బిబయి వెంటనే తమాయించుకొని 'ఆ ... కనుపించాడు. బికాం ప్యాసు అయ్యాడు.' అన్నా నవ్వుతూ. 'మరి... మీరు?' అంది. 'ఆ ఫస్టుక్లాసులో ప్యాసు అయ్యా' అని ఆమెకేసి చూచా. సంతోషంతో తల వాల్చింది. వీధికేసి అటుయిటు చూసి "ఇంకా చదువుతారా?... ... అయినా మరొక వూరు వెడతారు లాగుంది." అంది నవ్వుతూ. 'బహుశా మద్రాసులో ఎలక్ట్రిక్ యింజనీరు కాలేజిలో చదవాలని వుంది. అక్కడకు వెడతాను' అన్నా. శారద ముఖంలో కొంచెం విషాద రేఖలు కన్పించాయి. కాని మరు క్షణంలో మంచి చదువుకు వెళ్లబోతున్నానని సంతో

వంతో ముఖం వికసించింది. ఇంతలోకే వాళ్ల అమ్మ వచ్చింది. నన్నుచూసి 'ఏమండి ప్యాసు అయినారా' అంది. ''ఆ'' అని సమాధానం చెప్పా. ఇంతకీ మాకు జరిగిన సంభాషణ వినలా ఆవిడ. వింటే ఏమయ్యేదో! బహుశావింటే కూతుర్ని పరాయి వాడితో మాట్లాడుతున్నందుకు కేక వేసేదేమో? 'వెడతానండి' అని చెప్పి శారదముఖం కేసి చూశా. చిరునవ్వుతో వికసించింది ముఖం. ఆనంద డోలికల్లో తేలిపోతూ యింటి దారి పట్టా.

ఆ రోజు మద్రాసు చదువుకోసం బయలుదేర బోతున్నా. సాయంకాలం బండికి వెడదామని పెట్టె, బెడ్డింగు సర్దుకున్నా. నిజం చెప్పాలంటే, ఆ రోజు కొంచెం విచారంగానే గడిచింది-శారదకు దూరమవుతున్నానని. వెళ్లేముందు శారదను చూడాలని బుద్ధి పుట్టింది. 5½ గంటకి వాళ్ళ యింటివేపు వెళ్ళా. ఏదో పనిమీద బయటకువచ్చి నన్నుచూసి ఆగిపోయింది. 'ఇంకో గంటకి మద్రాసు బయలుదేర బోతున్నా' అన్నా. సమాధానం లేదు. కొంతసేపాగి...... 'శలవల్లో వస్తూ వుంటారా? లేకపోతే ఇక్కడిదంతా మర్చిపోయి అక్కడే వుంటారా?' అని తలవంచి అడిగింది. ''ఇక్కడిదంతా అంటే'' కొంటెగా ప్రశ్నించా (కొద్దిగా తబ్బిబ్బై) ఆ...... 'మీకు అలవాటయిన యీ రోడ్డు — మీ స్నేహితులు, మీ శరీరంకోసం ఎదురు చూసే కళ్ళు, ఇంకా' అంటూ వుండగానే గబాలునా ఆమె చేతిని నా చేతుల్లోకి తీసికున్నాను ఎవరయినా చూశారేమోనని యిద్దరం కలవరపడ్డాం కాని అలాంటిదేమి జరగలా. 'ఏమిటిది - నడిబజార్లో' అంది శారద. 'ఈ దీనుడు ఎక్కడున్నా నిన్ను మర్చిపోడన్నా' నవ్వుతూ. 'అమ్మ వస్తుందేమో నేను వెడతా' నంది. 'నేను వెడతా. శెలవల్లో తప్పకుండా వస్తా'నని చెప్పి యింటికి వచ్చా.

త్యాగరాయ నగర్‌లో ఒక యిల్లు అద్దెకు తీసుకున్నా. చదువు జోరుగా సాగుతోంది. శెలవలిచ్చారు కాని బెజవాడ వెళ్ళలేదు. శారదకోసం వెడదామనుకొన్నా కాని చదువుమీద వుత్సాహం యెక్కువయింది. నాలుగు సంవత్సరాల కాలచక్రం గిఱ్ఱున తిరిగింది. పరీక్ష లయిపోయాయి. యూనివర్సిటీ ఫస్టు వస్తుందనే ధీమాగావుంది. స్నేహితులు కూడా అదేమొక్క అన్నారు. ఇంటికి వద్దామని బయలుదేరా. ఇంతలోకే పంకజ నయన వచ్చి 'ఏమండీ, నేనుకూడా రాత్రి ట్రయినుకే బయలుదేరుతున్నా. మీరు బెజవాడ. నేను ఏలూరు. ట్రయిను జర్నీ హాయిగా వుండవచ్చు ఏమంటారు?' అంది. 'మీకు నా సంగతెవరు చెప్పారు' అన్నా నవ్వుతూ 'వనజ చెప్పింది' అన్నాది. నేనంటే కాలేజీలో నలుగురు ఆడవాళ్ళకు తగని వాత్సల్యము. ఎంచేతంటే ఆడవాళ్ళయొక్క పురోభివృద్ధిని గురించి, వరకట్న నిర్మూలలని గురించి, చదువును గురించి చర్చలు వ్యాసాలు మొదలయినవి వ్రాసేవాడ్ని. ఆరోజు రాత్రి రైలు జర్నీ చాలా హుషారుగా జరిగింది. మర్నాడు 8 గంటలకు బెజవాడ చేరింది. పంకజ నయన దగ్గర శెలవు పుచ్చుకొని యింటికి బయలుదేరా.

ఇంటికి రాగానే రెండు రోజులలో రెండుమూడు పెళ్ళిసంబంధాలు వచ్చాయి. కాని నాకేమి నచ్చలా. మనస్సంతా శారదమీద లగ్నమవుతే. మరునాడు వుత్సాహంగా వాళ్ళ యింటికెళ్ళా. శారదావాళ్ళ అమ్మ చాలా గౌరవంగా మాట్లాడింది. చాలాసేపు అనేక కబుర్లమీద శారద పెళ్లి ప్రస్తావనయెత్తి కట్నాల గొడవంతా చెప్పి 'మీ స్నేహితులెవరయినా వుంటే కాస్త చెప్పండి! పెళ్ళి చేసేయాలని వుంది' అంది. '......అన్నట్టు నా స్నేహితుడున్నాడు. చాలా బాగుంటాడు. నాతోపాటే చదివాడు. మీ అమ్మాయి చేసుకోవచ్చు బహుశా. నేను తప్పకుండా వొప్పిస్తాను లెండి. కట్నంకూడా తీసుకోడు. పిల్ల మాత్రం బాగుండాలన్నాడు వాడితో ఒకసారి ఏ సంగతి కనుక్కొని చెబుతానులెండి' అన్నా సంతోషంతో 'అలాగే లెండి' అందామె, కాని గోడ ప్రక్క నిల్చున్న శారద ముఖంలో విచారం కోపం వచ్చాయి.

నా మాటలకు నమ్మించి మోసం చేశాననుకుంది. శారదకేసి ఒక కన్ను వేసి అంతా కనిపెట్టా. 'వెడతానండి' అని చెప్పి యింటికివచ్చా. అమ్మా నాన్నతో పెళ్ళిసంగతంతా చెప్పి ఆ అమ్మాయినితప్ప యింకోళ్లని చేసుకోనని చెప్పా. మా నాన్న మొదట ఏదోఅన్నా తరువాత సరే అన్నారు. మంచి రోజున ముహూర్తం నిశ్చయించారు. నెల రోజులలో దిగ్విజయంగా పెళ్లి ముగిసింది...... ఎందుకొచ్చిన ప్రేమ పెళ్లిగాథ అని నీతో చెప్పలా. సరే కాలక్షేపానికి రైల్లో ప్రసాదుతో సగం చెప్పా. సరే...... ఇంక నీ పెళ్లి గాధ విన్న తర్వాత నా వింతగాధకూడా వివరించా. ఇదీ నా ఆరు ఏళ్లు ప్రేమ కలాపాలు జరిగిం తరువాత జరిగిన వింత ప్రణయ పెళ్లిగాథ." అంటూ ముగించా. 'నీదానికంటే వీడి కథే బాగుందిరా' అని ప్రసాదు నా వైపు తిరిగాడు. ఇంతకీ... 'యిద్దరూ అదృష్టవంతులురా' సుఖ జీవితం సాగించవచ్చు అన్నాడు ప్రసాదు.

మన పూర్తి కథతో కలువరాజు కలువ చెలిని కలుసుకోటానికి బయలుదేరాడు. మేంకూడ మా కోసం కనిపెట్టుకుని కూర్చున్న మా చెలులంకరదకు బయలుదేరాం. అందరూకలిసి యింటిముఖంపట్టారు.



# దివ్యపురుషులు


రచన :
శ్రీ స్వామి యస్. బి. కేశవయ్య

అనుసరణ :
శ్రీ సి. సి. పున్నయ్య


[రచయిత పూజ్యులు శ్రీ స్వామి కేశవయ్యగారు శ్రీ శాయిబాబా ఉపాసకులు. దైవీకంగా సమకూరిన దైవజ్ఞతతో స్వార్థరహితులుగా తమ జీవితమును పీడితమానవ సేవకు అంకితముచేసిన తపోధనులు. వారి నిరాడంబర నిర్విరామ సేవా కార్యక్రమము అనేకులను శ్రీ బాబా అనుగ్రహ కటాక్షములకు పాత్రులుగాచేసి మానసిక, శారీరక స్వస్థతలను చేకూర్చుచున్నది. కుల, మత, వర్గ బేధ రహితంగా వేలకొలది ప్రజలు ప్రతి గురువారం మద్రాసులో షెనాయ్ నగరులోని వారి నివాసమునకు దూరప్రదేశములనుండి సుతము వ్యయప్రయాసలను లెక్క చేయకుండావచ్చి శ్రీ బాబా ఆరాధనలో పాల్గొని శ్రీ స్వామి కేశవయ్యగారి మూలంగా శ్రీ బాబా అనుగ్రహ కటాక్షములకు పాత్రులగుచున్నారు.

శ్రీ స్వామి కేశవయ్యగారివంటి దివ్య పురుషుల ఆధ్యాత్మిక ప్రభావమును, సేవానిరతిని మానవకోటి వినియోగించుకుంటే జీవయాత్ర సుగమం కావడమేకాక శాంతి సౌభాగ్యాలకు లోటుండదు.]

మన దేశము ఋషులకు, దివ్య పురుషులకు అనాదికాలమునుండి నిలయము ఆదికాలమునుండి ఆధునికయుగపు శ్రీ శాయిబాబా, రామకృష్ణ పరమహంసవరకు యిట్టి మహాత్ములు వరుసగా నుంటూ వచ్చిరి. వీరి ప్రపంచములో స్వయంగా తమ సందేశమును పూరించి మానవకోటిని పాపములనుండి, దుఃఖములనుండి రక్షించుటకు అవతరించియుండిరి.

దివ్యపురుషులనగా పరమాత్మ జ్ఞాన సిద్ధిని పొందినవారు. ఇట్టి పురుషుడు ఆధ్యాత్మిక భాషలో 'జీవన్ముక్త' యనబడును. వారు ఆధ్యాత్మికంగా ఉన్నత శిఖరముల నందుకున్నప్పటికిని, కష్టాలతోటి, దుఃఖాలతోటి పాపభూయిష్టంగానున్న మానవ జీవితమును నిర్లక్ష్యముచేసి, ధ్యాన తపస్సులకు ఒంటరిగా కొండ గుహల్లోకి వెళ్ళలేదు. సానుభూతి ప్రేమలతో సోదర ప్రజానీకమును తమ ఆధ్యాత్మిక ప్రభావంతో ఉద్ధరించుటకు కృషిచేయుచుండిరి.

సందర్భానుసారాల ననుసరించి యీ దివ్య పురుషులు వివిధ రీతుల మానవసేవ చేయుచుండిరి. వారి జీవితము నిరంతరము చురుకైనదియై ఆధ్యాత్మికంగాను, సాంఘికంగాను సేవాకార్యక్రమములో నిమగ్నమైయుండును. దివ్యజ్ఞానముపొందినవారు దేవకార్యముల మరచిపోయి, భగవంతుని విస్మరించి గడపు ప్రతిక్షణము వృధాకాలయాపన అనిపించుకొనును. సాధారణ బోధకులవలె వారి బోధనలు తమ ఆధిక్యతను రుజువు చేయునట్టివిగా నుండవు. మహాత్ముల సేవానిరతి అధికంగా తల్లి

దండ్రులు తమ బిడ్డలను సుశిక్షితులుగా, పురోభివృద్ధి నుద్దేశించి ప్రతిఫలాపేక్షయను నది లేక చేయునట్టి కృషిలాంటిది; అనగా భౌతిక సాంఘిక పరిస్థితుల కతీతుడుగా దివ్య పురుషుడు పవిత్ర ప్రేమతో భగవంతుని ప్రతి జీవియందును కనకలుగుచున్నాడు.

దివ్య పురుషులు తమ నిర్విరామ ఆధ్యాత్మిక కృషివలన ఆదర్శనీయుడైన మానవుని పూర్ణపురుషునిగా సర్వ సద్గుణములతో రూపొందించి మానవ జీవితమునకు దివ్య జ్యోతిగా నొనర్చుచున్నాడు. దివ్య పురుషుల జీవిత విధానములో గము నిరచతగినది సర్వ ప్రాణికోటిపట్లవారికిగల అవ్యాజమైన ప్రేమ. ప్రతి జీవిలోను భగవంతుని చూడగల దివ్య పురుషుడు ఏ పరిస్థితులలోను యితరులను బాధపెట్టడు; ఎందుకనగా అలా చేయడం భగవంతుని బాధపెట్టి అపచారము చేసినట్లేకాగలదు. వారి ప్రేమ 'అహింస' తో మాత్రము పరిమితముకాక సర్వ జీవరాసులు వారి దయకు పాత్రమగుచున్నవి. దివ్య పురుషుని హృదయము దుష్టులను, క్రూరులను సయితము సానుభూతితో సత్పురుషులుగా చేయుటకొరకు అవకాశమునకు వెదకు చుండును. అట్టి ప్రేమయే మానవునిలో స్వార్థరహితమయిన సేవను ప్రోత్సహించును.

దివ్య పురుషునిలో మరొక విశేషమేమనగా సత్యముపట్లప్రేమ. దివ్య పురుషునకు సత్య స్వరూపము పరమాత్మ. దివ్య పురుషులు తాము పరిపూర్ణులై యితరులను సయితము తమదృష్టి ప్రభావముతోనే పవిత్రులను చేయకలుగుచున్నారు. వారి నుండి వెలువడు ఆధ్యాత్మిక అలలు విశాల ప్రపంచములో అమోఘ ఫలితములకు కారణమగుచున్నవి. దివ్య పురుషుని సమక్షమున మానవునిలో ఏర్పడు మానసిక పరివర్తన, తన్మయత్వములు తన్ను పవిత్రునిగాజేయు ప్రభావమునకు నిదర్శనము. దివ్య పురుషులు యితరుల శుద్ధిచేయు సందర్భమున 'అహం'ను చంపుకొను నట్లుగా ప్రేరేపించుట, దానిని స్వయంగా ప్రదర్శించుట కార్యక్రమ అంశాలు. ఇదే తుదకు మానవుల దుఃఖములనుండి, కష్టములనుండి విముక్తిచేయునట్టి మార్గము.

పుణ్యక్షేత్రాలుగా రూపొందిన యాత్రాస్థలములు సయితము దర్శించి సేవించవచ్చిన యాత్రికుల పాపముల పరిహరించు మహాత్మ్యము, పవిత్రత దివ్య పురుషులతోగల సంబంధమువల్ల - అనగా జన్మస్థలముగానో లేక నివాసస్థలముగానో లేక తమ దివ్య సందేశమును పూరించిన స్థలముగానో ఆర్జించినవే. పవిత్రుడైన యాత్రికునిపై క్షేత్రముతో సంబంధము గల దివ్యపురుషుల ప్రభావము, భగ

వంతునిపట్లగల పవిత్రభావము కాననగును. నాస్తికునిపై - అనగా భగవంతుని ఉనికి పట్ల, ఆధ్యాత్మిక చింతనపట్ల నమ్మకము లేనివాడు పుణ్యక్షేత్రముల దర్శించినను పరివర్తనయుండదు. ఎందుకనగా అతనిలో పవిత్రతకు చోటులేదు, దాని ననుసరించి సత్ఫలితములుండవు.

దివ్య పురుషులు మానవులమధ్య నివసించి సంచరించినను ప్రాపంచిక వ్యవహారాల ప్రభావము వారిపై నేమియు పని చేయలేదు. వారికి మానవసేవ ఉత్తమోత్తమమయిన ఆరాధనా కార్యక్రమము. అట్టి ప్రతియొక్క ఆరాధనా కార్య విధానము భగవంతునిపట్లగల భక్తిచే ప్రోత్సహించబడి అనుసరించ బడినది.

# మనసొల్లని మొగుడు
## లేక
# నీవేమంటావు??

శ్రీ బచ్చల మునికన్నయ్య

ఆనాడు అందరు ఉపాధ్యాయులకు జీతాలొచ్చాయి. చాల ఉషారుగా నెలకు అవసరమైన సామానులన్నీ కొన్నాను. సాయంకాలం హాయిగా రాజా, నేను షికారు వెళ్ళాం. నవనవలాడే ఆ నందన వనంలో ఆనందభావాలు స్వేచ్ఛగా రేకెత్తుతున్నాయి.

నేను, రాజా మా జీవితాల్లోని లోతుపాతులగూర్చి తల్చుకొన్నాం. చిన్నప్పటి ఆలోచనలకు, నేటి జీవిత నాకాయాసాలకు హస్తిమశకాంతలున్నాయని గ్రహించాం. ముందాలోచన కూడదనే పెద్దల వాక్యం వృథా కాలేదని తలంచాం. రాజా నేను ఒకే బడిలో చదివాం. గ్రామాలను పునరుద్ధరించి, గ్రామ ప్రజల జీవన ప్రమాణాలను పెంపొందించాలను భావాల హారిని సృష్టించుకొన్నాం. మా సిద్ధాంతాలను అర్థం చేసుకొనే వ్యక్తులు, మా హృదయ నిర్మలత్వాన్ని ఆకళింపు చేసుకొనే కార్యకర్తలా పల్లెల్లో కరువయ్యారు. మమ్ముల గ్రాహ్యం చేసుకోలేక పోయినా పరవాలేదు... కాని గర్హించారు. స్వార్థ పరులు మా నీతి, నిజాయతీలకు కండ్లెఱ్ఱచేసికొని కారాలు మిరియాలు నూరి బదిలీలకు ప్రయత్నించారు. దైవ వశాత్తు రాజా ఉన్నత పాఠశాల్లో, నేను ప్రాథమికోన్నత పాఠశాల్లో పంతుళ్లుగా ఒకే పట్టణంలో చేరగలిగాం. రెండుమూడు సంవత్సరాల అనంతరం... ఈ మా చిన్ననాటి జీవిత సమగ్రాన్ని స్మరణకు తెచ్చుకొన్నాం ... గంట 7-30 అయింది. ఇండ్లకు మరలాం...

కాళ్లు చేతులు కడుక్కొని కంచం దగ్గర కూర్చున్నాను. అన్నం వడ్డిస్తూ అమ్మ కంట నీళ్లు పెట్టింది.

"ఏమమ్మా! ఈ రోజు నెలకొక సంతోషదినం. జీతం తీసిన దినం కండ్లు తడిపెట్టావు?"

"భోంచేయి! తర్వాత చెప్తాలే."

"ఇదేసుమ్మా? ఏడుస్తూ ఎగతాళి చేస్తావు?"

"ఎగతాళి ఏమీ లేదు నాయనా!"

"ఎందో మరి నిజం చెప్పరాదూ?"

"మీ మేనమామ కూతురు రామలక్ష్మి బావిలో పడి..."

"ఆ... ఆ..."

"ఆ... యేమి... నాయనా! చ...చ్చి...పో...యింది." అని మా అమ్మ బోరుమని యేడ్చింది. నాతల గిఱ్ఱుమని తిరుగుతూయుంది. కంచంలో అన్నం ఆరిపోయింది. మనసులో ఇనుపగుండ్ల బరువు పడింది. లేవ బుద్ధి పుట్టదు. కొంతసేపు తటమాయించి "ఏమమ్మా... నిజంగా చనిపోయిందా?"

"ఔను నాయనా?"

"ఎవరమ్మా చెప్పింది?"

"రంగయ్య మొన్న వచ్చాడట ... స్వయంగా అన్నీ చూచి వచ్చానని" చెప్పాడు.

"...... మంచిపని చేసిందిలే!"

"..................."

"అమ్మా! ఎందుకమ్మా! అప్పుడే చెప్పేశావు!"

"ఆపుకోలేక పోయాను నాయనా... భోంచేయి నాయనా!... ఆ పాడుపిల్ల చచ్చిపోవటంవల్ల కులానికి కీర్తి నిల్చింది..."

"అమ్మా... ఆ మాట అనకమ్మా! రామలక్ష్మిది తప్పేమున్నదమ్మా?"

"ఏమీ లేదు-కానీలే... ఇక భోంచేయి"

"...... వద్దమ్మా !" అని లేచి చేయి కడుక్కొన్నాను. రాత్రి 9 గంటలైంది. పండుకొన్నాను. నిద్ర పట్టితేగా......

... పది సంవత్సరాల మాట... నేను ఎనిమిదవ తరగతి చదువుతూ యున్నాను. పిల్లను చూడాలని మా అమ్మ "కడప"కు దగ్గర దిగువ పల్లెకు పిల్చుకొని పోయింది... తమ్ముని యింటికి తన్మయతే చెందుతూ... మా మేనమామ... చెంగయ్యకు నామీద మితిమీరిన ప్రేమ. తన స్వంత పెద్ద బావమరిది చనిపోయిన తర్వాతనే యీ మక్కువ అంకురించింది... రామలక్ష్మికి పది వర్షాలు పూర్తికాలేదు. ఐదవ తరగతి చదువుతూయుండి. కోయిలగాన...సినిమా పాటలు చాల బాగుగా పాడేది. "అదిగో బావ వచ్చాడులే" అని వాళ్ళమ్మ అన్నప్పుడు అదో రకం చిరునగవుతో "పోమ్మా" అని గిఱ్ఱుమని తన వాల్జెడను విసురుకొంటూ యింట్లోకిపోయి మళ్లా చిన్న చిన్నగావచ్చి అమ్మ ప్రక్కన చేరేది.

వెంకట్రమణ చదువుతూ వుండి అకస్మికంగా మరణించాడు. చదివించి తన స్వంత బావమరిదికే తన కూతుర్ని ఇచ్చి పెండ్లి చేయాలనుకొన్న చెంగయ్యగారి హృదయం వెంకట్రమణ మరణాంతరం మారటం జరిగింది. మరొక చిన్న స్వంత బావమరిది యున్నాడు. కాని సుబ్బన్న చాల చిన్నోడు. రామలక్ష్మి కన్న రెండు వర్షాలు చిన్న. కాబట్టే ఇక చదువుచున్న నా మీద మామగారికి ఎక్కడలేని అనురాగం.

మంచంలో నిద్రపోతూ వున్నాను. చల్లగ చినుకులు పడ్డట్లు నీళ్ళు పడ్డాయి. చివాలునలేచి, చేతులు వేడిచేసి కండ్లకు అద్దుకొన్నాను. అప్పుడే ఉదయభానుని బంగారు లేత కిరణాలు గవాక్షంపై పడుతున్నాయి. అటు ఇటు చూశాను ... "ఇది కలయా" అని సందేహపడ్డాను ... కాని కాదు... సూర్య భగవానుని చక్కలిగింత కప్పుడే విచ్చుచున్న అరవిందంలాగ సంతోష వికసిత వదనారవిందంగల రామలక్ష్మిని ప్రక్కన బారెడు దూరంలో గుంజకు ఆనుకొనియుండటం చూశాను. నా చూపులోని అమాయకత్వాన్ని చూచి పక్కన నవ్వింది... "బలే పని చేశావు... చన్నీళ్ళతో సరసమాడే జాణవే! భేష్! ఏదీ? ఒక తియ్యని పాట పాడూ !" అని అడిగాను.

...రామలక్ష్మి అటు ఇటు చూసింది.

"ఎవరూ లేరులే ... సిగ్గేటికి మరి?"

"పరవాలేదులే ! పరిహాసాలకు..."

"అయితే పాడవూ ?"

"చాల బిగువూ... వుండే... వుండు... పాడుతా" అని గొంతు సవరించుకొంది రామలక్ష్మి...

"బావగారితో బంతులాడితే
బంగరు ఏరు ప్రవహిస్తుందా !
బలత్కారముగ పెండ్లియాడితే
పవిత్రవలపు స్రవిస్తుందా !"...

అని తీయని వలపు సూత్రాలన్ని ప్రబోధించింది. ఏ సినిమాలో నుండో నేర్చుకొన్నది కాబోలు. ఆ మధుర గేయానికి ప్రతిఫలం...??... జోబీ తడుముకొన్నాను. కలకండ — ఖండము — చిక్కింది చేతికి ..."ఇదిగో అని చేయి చాపాను..."పో బావా!" అని సందేహ పడింది రామలక్ష్మి... "అదిగో మనసులో... తీసికోవాలంటున్నావు... మాటల్లో మాత్రం వద్దంటున్నావు"

"ఉత్త చెయ్యి ... ఏడ్పించేదానికా !"

"సందేహం సర్వరోగాంకురం"

"నిజంగా కలకండ యుందా ?"

"రా ! నోరు తెరువు ! నోటిలో వేస్తా !"

"ఇంతకుముందు తీసుకోమన్నావు. ఇప్పుడు నోరు తెరువమంటున్నావు"

"తీసుకోనేది వేసుక నేదానికే కదూ ?"

"ఏదీ చూపూ ?" అని రామలక్ష్మి అర్థ అంగీకారాన్ని సూచించింది.

"ఇదిగో చూడు......" అని ఒక క్షణం చూపి టక్కున చేయి ముడుచుకొన్నాను. దగ్గరవచ్చి రామ

లక్ష్మి చేయి పట్టుకొనింది. నా చేయి విదిలించుకొని, రామలక్ష్మి చేయిని పట్టుకొన్నాను. నోరు తెరువమన్నాను. నోరు తెరిచి సగం కలకండ ముక్కను తిని మిగిలిన సగం నోరు తెరువమని నా నోటిలో పెట్టింది. రామలక్ష్మి లాలాజలం కలకండ మధురాన్ని పదిరెట్లు చేసినట్లుంది. ఇంతలో రామలక్ష్మి అమ్మ దొడ్లోనుండి "లక్ష్మీ!" అని పిలిచింది. రామలక్ష్మి నిరాశతో లేచిపోయింది.

మధ్యాహ్నం భోజనానంతరం తాంబూలమిచ్చారు. "చదువుకొనువారు వక్కాకు వేసికో రాద"ని మా అమ్మ చెప్పుతూయుంది. కాని అత్తగారు "ప్రతి దినమూ వేసుకోబోతావా ? ఈ నాడేగా ?" అని మా తల్లిగారి సిద్ధాంతాన్ని రద్దు చేసింది. ప్రక్కన కూర్చొనియున్న చెంగయ్య మామగారు "రాములూ ... మామగారికి సున్నము తేపో" అన్నాడు. సున్నము తెచ్చి రామలక్ష్మి తమలపాకుతో వుంచింది, వెంటనే మా అమ్మ సున్న పొకు తొడిమ, కొన, గిల్లి "రామలక్ష్మీ! మామగారికి ఆకులు మడిచియ్యి!" అన్నది ఆనందంతో. రామలక్ష్మి తల్లిదండ్రుల సమ్మతి సూచన వదనారవిందాలను పరికించి మడిచిచ్చింది ఆకులను. అక్కడ చేరిన ఇరుగమ్మ పొరుగమ్మ "ఈలాంటి చక్కటి బొమ్మలకే పెండ్లి చేయాల"ని చప్పట్లు కొట్టుతూ నాంది పాడారు. చెంగయ్య "అందుకేమి సందేహం! చిలకాగోరంకల లాగా వారుంటే నా ఆనందానికేమి ? అయినా ఇప్పుడేమించిపోయినదేమి ? వీడికి కాక యింకెవరికీ యీయబోతాను ? వీడు నా అక్క కొడుకేగా!" అని సమ్మతి తెలుపుతూ వాయిదా వేశాడు. ఆయన మాటలను అందుకొంటూ "అనుకొన్నది త్వరగా చేయాలి" అని అన్నది మా అమ్మ.

"ఇంకా రెండు సంవత్సరాలు దాటితే చూచుకొంటాం. ఇప్పుడే ఏమి మునిగిపోయింది ?" అని రామలక్ష్మి తల్లి అడ్డ పుల్ల వేసింది. భార్య మాటను జవదాటలేని చెంగయ్య "అంతేమరి. ఇప్పుడేమి ? నేనే పిలిచి పిల్లనిస్తాగా! అబ్బాయి పదవ తరగతి వరకు చదవనీ ... అంతలో అమ్మాయి ఋజో వయస్సుకు వస్తుంది. అవసరపడేందుకు వీలులేదు. శారదా చట్టం అడ్డంగాయుంది. ఎందుకు చట్టానికి విరోధంగా చేయాలి ?" అని తన నిశ్చయాన్ని వెలిబుచ్చాడు.

"అయితేనేమీ పరవాలేదు. మాట యిస్తేచాలు. ఇంకా రెండు సంవత్సరాలుకాదు. మూడు సంవత్సరాలు దాటిన తర్వాతనే పెండ్లిచేయి" అని మా అమ్మ సమ్మతించింది,

మరునాడు మేము బయలుదేరాం. మామగారు, అత్తగారు మమ్ముల సాగనంపుతూ యున్నారు. కొంత దూరం పోయ్యాక తిరిగి చూశాను. పెరట్లో మల్లి చెట్టు పందిరి ప్రక్కన నిలబడి నిక్షిప్త నేత్రాల్తో చూస్తూయుంది రామలక్ష్మి. "పోయిరా!" అన్నట్లు తన హస్త విన్యాసం చేసింది. తియ్యని కలకండ నోటిలో పడ్డట్లైంది. తల పంకించి పల్లె దాటుకొని మా యిల్లు చేరుకొన్నాం సాయంకాలానికి,

## 2

మూడు వర్షాలు భూతకాలంలో లీనమయ్యాయి. మా పెద్దమామ కొడుకు రామన్న ఎగువ పల్లెనుండి నాలుగు జతల ఎద్దుల తోలుకొని వచ్చాడు మా గ్రామానికి అమ్మేందుకు. ఒక జాబు, ఒక సంచి ఇచ్చాడు రామలక్ష్మి ఇచ్చిందని నా చేత. చిరస్మరణీయంగా పంపింది కాబోలు. ఆ సంచిలో రకరకాల ఊలు దారాలతో అల్లిన విసనకఱ్ఱ, రంగు రంగుల దారాలతో అల్లిన బనీను రామలక్ష్మి హృదయాన్ని విప్పిచెప్పుతున్నాయి. జాబు మూత చింపి... "మ-రా-రా-శ్రీ మామగారికి రామలక్ష్మి ప్రార్థించి వ్రాసుకొన్న జాబు యేమంటే ? నేను క్షేమంగా యున్నాను. మీ క్షేమములు తెలుపవలయును. ఆనాటి నుండి మీకు జాబు పంపాలనుకొన్నాను. కాని పంపుటకు ఎవరూ రాలేదు. ఇప్పుడు రామన్న దగ్గర పంపుతూ యున్నాను.

నీవే నా ప్రాణ భర్తగా నిర్ణయించాను. తప్పక

నిన్నే పెండ్లి చేసుకొంటాను. రామన్నతో కూడా నీవు తప్పక రావలయును.

ఇట్లు,

తమ ప్రియురాలు

"రామలక్ష్మి"

చదువుకొన్నాను. దేహం పులకరించి పోయింది. మరొకమారు జాబు చదివాను. భద్రంగా జాబును దాచుకొన్నాను. పదిరోజుల్లో ఆరు ఎద్దుల అమ్మాడు. ఇంకా రెండు ఎద్దులున్నాయి. మరునాడు అవీ అమ్ముడైనాయి. రామన్న స్వగ్రామానికి ప్రయాణం కట్టాడు. సెలవుల్లో వస్తానని చెప్పి పంపాను. వారం తిరక్కముందే రామలక్ష్మి పుష్పవతైందని తెల్పుతూ, పుష్పవతి అయింది కుమార్తె శుభ కార్యానికి రమ్మని స్వాగత వాక్యాలతో జాబు చెంగయ్య దగ్గరనుండి వచ్చింది. పరీక్షలు దగ్గరగానున్నాయి. అమ్మను పంపాను. అన్నీ సంతోషప్రదంగా జరిగాయని అమ్మ వచ్చి చెప్పింది. పరీక్షలు ఇక పది రోజులున్నాయి. చాల ఆతురతతో పరీక్షలకై చదువుతూ యున్నాను. పదవ తరగతి పరీక్ష ... అందరు విద్యార్థులు గుండెలు చేతుల్లో పెట్టుకొని చాల పట్టుదలతో చదువుతూ యున్నారు. ఇంతలో పిడుగులాంటివార్త వినపడింది. "సుబ్బన్నకు రామలక్ష్మికి పెండ్లి" అని. మరు రోజే పెండ్లిపత్రిక వచ్చింది. హృదయం ఆగిపోయినట్లైంది. మాఅమ్మగారు ఏడ్చుచూ తమ్ముని తికమకా తిడుతూ యుంది. నాకేమి గోచరం కావటంలేదు. మరురోజు రామన్న దగ్గరనుండి జాబు వచ్చింది.

మామగారూ !

నీవు తప్పక రావలసింది. కార్యం మీరిపోతూ యుంది. పెండ్లికి రామలక్ష్మి యిష్టపడలేదు. కాని బలాత్కారంగా పెండ్లి జరుగబోనున్నది. నీవు సాహసిస్తే రామలక్ష్మిని నేను దాచిపెట్టి మీ స్వాధీనం చేయగలను. వెంటనే తప్పక రావలయును. ఈ జాబు తంతిగా భావించి రావలయును.

ఇట్లు

రామన్న

ఆ జాబు చదివాను. ఆకాశం భూమిని తాకుతున్నట్లుంది. హిమాలయం సముద్రంలో మునిగిపోయినట్లుంది. వేయిరైళ్ళు నా గుండెలో పరుగెడుచున్నట్లున్నాయి.

"ఏమి మార్పు! ఆనాడు మామగారు పల్కిన మాటలేమి? నేడు జరిగే కార్యమేమి? రామలక్ష్మికి బలత్కారముగా పెండ్లి జరుగుతుంది. సుబ్బన్న భర్త. ఇంతకూ కారణం చెంగయ్యగారి బానిస జీవనమే... చెంగయ్య అత్తగారింట్లో యిల్లరికానికి పొయ్యాడు చిన్నప్పుడే. అత్త, భార్యల మాట తిరస్కరిస్తే ఆస్తిపాస్తులకు భంగం యేర్పడుతాయని భయపడే భీరువు చెంగయ్య. చిన్నప్పటినుండి వారి అడుగులకు మడుగులొత్తే అతని గారికి స్వతంత్ర జీవనము రమ్మన్న వచ్చునా! రాదు... పరులకిస్తే తమ ఆస్థి ఇతరులు మ్రింగేస్తారని కాబోలు. తన తమ్మునకే — చిన్నవాడైనా సరే రామలక్ష్మిని యిచ్చి పెండ్లి చేయాలని నిశ్చయించింది. భర్తగారిని శతపోరి ఒప్పించింది. రామలక్ష్మి తెలివిలో మిన్న ... గుణములో మణి. చేతలలో రత్నం. సొంత తెలివి నుపయోగించి సాహసించ వచ్చుకదా? అయినా అబల కదూ? తల్లిదండ్రులను వితర్కించి పదామడదూరం రావటం ఏలాగు?... ఇష్టంలేకపోయినా తల్లి మోసపు మాటలకు బేలయిపోయిందేమో? ......వలపించిన వరుణ్ణి ప్రేమించాలని మనసున్నా... మార్గం సుగమమైతే కదూ!... ఎట్లు పరితపించుచున్నదో పాపం...పాపమేమిటి? పరితపించి సర్వాన్ని పరిత్యజించి నిత్యనిర్మల వలపు కౌగిటకు ఎంతటి సాహసానికైనా స్త్రీ వెనుదీయదు గదా! ... కాని ఏమి చేయగలదు?

కన్న తల్లిని కాలదన్ని పెంచి పెద్దచేసిన తండ్రిగారిని ద్వేషించి ఏలా ముందడుగు వేయగలదు?... మనసు లేని మనుషులతో పోయి యేమి సాధించాలో నాకు గోచరం కావటంలేదు. రామన్న అనుకున్నంత పని అంత సులభంగా జరుగుతుందా? పెండ్లి కార్యాల భీభత్సంతో ప్రారంభమైతే భవిష్యత్తు ఏలా పరిణమిస్తుందో?......పరీక్షలు మూడు రోజులున్నాయి. పది సంవత్సరాల జ్ఞానాన్ని పరీక్షించి పట్టమిచ్చే తుది పరీక్ష. రాక్షస వివాహము ఎంతవరకు మన జీవితమును ఆనంద డోలికలలో నడుపగలదు? పది ఆమడదూరం తప్పించుకొనిరావడం యేలాగ?...... అందరు నన్ను ఏమనుకొంటారు? సంఘం నన్ను నిందిస్తుందా? నాకు నీరాజనా లిస్తుందా? అవసర పడితే భవిష్యత్తు అంధకార బంధురమౌతుంది. నిదానం ప్రధానం"... ఈలాంటి జీవిత ప్రశ్నావళి నా తలలో వేలాదిగా దొర్లుతున్నాయి. తుట్టతుదకు రామన్నకు

"రామన్నా! అవసరపడ మంటున్నావు. ఇది జీవిత సమస్య. ఈనాటితో పోవునది కాదు. నేనువచ్చి సంఘంలో నేటి సాంప్రదాయాలకు అక్రమంగా రాక్షస పద్ధతిలో రామలక్ష్మిని తీసుకొని పోవుటకు సాహసించటం లేదు. పరీక్ష లా మరునాటినుండి ప్రారంభం. విధితప్ప వీలుకాదు. సాధ్యమైతే మీరు రామలక్ష్మిని మా ప్రాంతానికి పిల్చుకొని వచ్చారంటే... తర్వాత అన్నీ ఆలోచిస్తాను. ధైర్యముంటే యీ పని చేయి" అని వ్రాశాను.

పరీక్షలు వారం రోజులు జరిగాయి. సెలవులొచ్చాయి. పెండ్లి హడావిడిగా జరిగిపోయిందన్న వార్త విన్నాను. ఇంక ఆశ యెందుకు? వివాహమైంది. చెమట పట్టుతూ యుంది. స్వేద ప్రవంతి వేడెక్కిన హృదయాన్ని తడిపి వేస్తూవుంది. విసనకఱ్ఱను తెమ్మన్నాను. అమ్మ రకరకాల ఊలు దారాల విసకఱ్ఱ తెచ్చింది. చూశాను. మధురస్మృతులు స్ఫురణకొచ్చాయి. మందస్మిత వదనారవిందుడై "ఇంకెందుకు యీ భూతకాల అనుభవాలను ప్రేరేపించే ప్రేరణలు?" అని... సంచి, చినిగిన బనీను, విసనకఱ్ఱ, ప్రేమలేఖలు... అన్నీ రిజిస్టరు పార్సలు చేశాను చెంగయ్యగారికి. నా బరువు తీరిపోయింది... బాధ్యత జారిపోయింది.

(సశేషము)

# చెప్పుల జత

మూలం :
శ్రీ స్నేహరశ్మి

అనువాదం :
శ్రీ వి. యస్. రామమూర్తి

అది గ్రీష్మఋతు మధ్యంలో నొకనాటి మిట్ట మధ్యాహ్న సమయం. ఈశ్వరుడు తన మూడో కంటిని తెఱచి లోకాల్ని దహిస్తున్నాడా అన్నట్లుగా చండభానుడు నిప్పుల కురుస్తున్నాడు. వడగాడ్పులు యీ చెవినుండి ఆ చెవికి తీవ్రంగా తాకుతున్నాయి. భూమ్మీదుండే సమస్త జీవకోట్లు ఆ ప్రచండ తాపానికి తట్టుకోలేక ఎక్కడికక్కడ వగరుస్తూ, అసహాయంగా నిట్టూరుస్తున్నాయి.

ఇల్లు వదలి వెలుపలికివస్తే ఎక్కడ తల పగిలిపోతుందో, వడదెబ్బతగిలి స్పృహ తప్పిపోతుందో అన్న భయంతో యిళ్లల్లోనేపడియుండి శైత్యోపచారాలు జేసికొంటూ సతమతమౌతున్నారా యూరి ప్రజలు. వీధులన్నీ నిర్మానుష్యంగానున్నాయి. కాని యింత ఎండలోను వయసుమళ్లిన స్త్రీ యొకతే కట్టెలమోపు నెత్తిపై బెట్టుకొని వీధిచివరినుండి వస్తూంది. అటు తల, కడుపు, యిటుకాళ్లు మాడి పోతున్నా ఆమె కదేమీ పట్టినట్టేలేదు. ఆమె మనస్సంతా దూరంగా అగుపిస్తూన్న "శివరీ" కొండలపైనే ఉందా రోజున. ఒక్కగా నొక్క కొడుకు, తన యంధకారమయ జీవితాని కాశాజ్యోతి-యీ వృద్ధాప్యంలో తనకేకమాత్రాధారం ఐన తన బిడ్డడు రాము 'శివరీ' కొండల్లోని రాళ్ల గనిలో పనిజేస్తున్నాడు. యీ పాపిష్టి ఎండలకు తన బిడ్డడు ఎట్లా తట్టుకొంటున్నాడో! ఏమవస్థలుపడుతున్నాడో! అన్న చింతే రంగమ్మ హృదయాన్ని చండభానుని తీవ్రకిరణాలకంటె ఎక్కువగా దహించివేస్తూంది.

పొట్టగడవాలంటే అటు రాము, యిటు తనూ యిద్దరూకూడ ఎండవానల్ని లెక్క జేయక ఒళ్లువిఱిచి పనిజేయాల్సిందేనని రంగమ్మకు బాగా తెలుసు. తనకేమైనా చింతలేదు; కాని రాము...? వాడెట్లా పనిచేయగలడీ ఎండల్లో? నెల్లాళ్లకుముందు రాము ఒకసారి తన యొద్దకు వచ్చినపుడు అతని కాళ్లకు చెప్పులు లేకపోవడంచూచి ఆ మాతృహృదయం తల్లడిల్లిపోయింది.

"కాళ్లకేమీలేకుండా ఎట్లాపనిజేస్తావు నాయనా! యీ ఎండల్లో" కొడుకు పాదాలకు ప్రమిదలోని నూనెరాస్తూ ఆప్యాయంగా అడిగింది రంగమ్మ.

రాము చిన్నగా నవ్వేడు.

"మరేం పరవాలేదమ్మా అక్కడుండే రోడ్లన్నీ చాల సాఫీగా ఉంటాయి.

మనూళ్లోవలె ఆ రోడ్లపైన ముళ్లూ ముట్రా ఉండనే ఉండవు. పైగా అక్కడి వారున్నారుచూడు - ఆ వెంగళాయిలకేమీ చేతకాదు. వాళ్లుకుట్టే చెప్పులు ... థూ ... మనూళ్లో వెంకడుకుట్టే చెప్పులముందు దిష్టితియ్యడానిక్కూడ పనికిరావు. అందుకే నా కాలికొలత యిస్తాను. నీవు వెంకడి దగ్గర చెప్పులు కుట్టించిపంపమ్మా.''

రెక్కలు విరిగేటట్టు కష్టపడ్డాకూడ, ఆ వచ్చే కూలిడబ్బుల్తో వారిద్దరికీ పొట్టగడవడమే బ్రహ్మాండమైపోతూంది. తిన్నా, పస్తున్నా రాము మాత్రం ఎప్పుడూ సంతోషంగా నున్నట్లే అగుపడ్తాడు. అతని పెదవులపై ఎప్పుడూ చిరునవ్వు తొణికిసలాడ్తూనే ఉంటుంది. చచ్చీ, చెడి, కడుపు కట్టుకొని పావలో, అర్ధో రంగమ్మ వెనకేసినా, అదంతా ఏనాడో తానీయవలసిన పాతబాకీ, దానికయ్యే వడ్డీక్రిందనే హరించుకుపోతూంది. ఈ అప్పుబాధనుండి రక్షించి, వృద్ధాప్యంలోనున్న తల్లిని ఎట్లాగైనా సుఖపెడదామనే రాము రాత్రింబవళ్లు ఎడతెఱిపిలేకుండ కష్టించి, పనిజేస్తూ నాలుగురాళ్లు వెనకేసుకొచ్చే ప్రయత్నంలో నున్నాడు. అతని శరీరం పైనుండే చిరిగిన దుస్తులే యిందుకు తార్కాణం. రూపాయి మిగిల్చినా వడ్డిబాధ కొంతైనా తగ్గుతుందనేగా తానింతవరకు చెప్పులు కొనాలన్న తలంపునుకూడ దగ్గరకు రానీయకపోడానికి కారణం? కాని యీ ఎండలో భుగభుగమంటూ పాషాణంవలెనున్న భూమ్మీదనుంచొని పనిజెయ్యడం మాటలా? చెప్పులో, జోళ్లో లేకపోతే పనిజెయ్యడం అసంభవం. 4, 5 రూపాయలుబెట్టి తానెట్లానూ జోళ్లుకొనలేడు. అందుచేత ఏమైనాసరే చెప్పులుకొనక తప్పదు. కాని యీ కంపెనీలో అమ్మే చెప్పులకంటె తన యూళ్ళో వెంకడు కుట్టేవే ఎంతోనయం. ఎట్లావాడినా సంవత్సరం బాగా మన్నికకొస్తాయి. అదీగాక, తానుగా రాముకు చెప్పులు కుట్టించి పంపుతున్నందులకు అమ్మకూడ ఎంతో సంతోషపడుతుంధి. అందుకే వెంకడి చేతనే చెప్పులు కుట్టించిపంపమని రాము తల్లిని కోరాడు. ఆ మర్నాడు రాము పనిలో కెళ్లిపోయాడు. రంగమ్మ ఎంతో ఉత్సాహంతో ఆ దినమే వెంకడి దగ్గరకు వెళ్ళి కొలతలిచ్చి వచ్చింది. కాని యింత వరకు ఆ త్రాగుబోతు చెప్పులు కుట్టి యివ్వనేలేదు.

ఎట్లాగైనా, తుదకు దగ్గరుండియైనా సరే, యీ దినం చెప్పులు కుట్టించి తీసికొనిపోవడానికే రంగమ్మ నిశ్చయించుకొంది. అగ్ని శిఖల్ని వెలుపలికి గ్రక్కుతూన్న 'శివరీ' కొండలు, దావాగ్ని మధ్యంలోబడిన చిన్నపక్షి పిల్లవలె తట

(549-పేజి చూడుడు)

# ప్రపంచ వైజ్ఞానిక సంస్థ

డాక్టరు లక్ష్మణస్వామి మొదలియార్

దక్షిణ ఆగ్నేయాసియాల చరిత్రలో తొలిసారిగా ఒక అంతర్జాతీయ సమావేశం ఈ సంవత్సరం నవంబరులో ఢిల్లీలో జరుగుతున్నది. ప్రపంచ వైజ్ఞానిక సంస్థ నవమ వార్షిక సమావేశం ఈ నవంబరులో న్యూఢిల్లీలో జరుగుతుంది. ఐక్యరాజ్య సమితి మొదట నెలకొల్పిన ప్రత్యేక సంస్థలలో, ప్రపంచ వైజ్ఞానిక సంస్థ ఒకటి. ప్రపంచ వైజ్ఞానిక సంస్థ ప్రధాన కార్యాలయం పారిస్‌లో వున్నది. అయితే వార్షిక సమావేశాలు ఇతర దేశాలలో జరుగుతూ వచ్చాయి. ఇంతకు పూర్వం ఈ సంస్థ సమావేశాలు బెరూట్, ఫ్లారెన్సు, మెక్సికో, మాంటివిడోలలో జరిగాయి. ఈసారి భారత దేశంలో జరుగ నున్నది.

## వార్షిక సమావేశాలు

ప్రపంచ వైజ్ఞానిక సంస్థ వార్షిక సమావేశాలు 1946 నుంచి 1956 వరకూ ప్రతి సంవత్సరం జరిగాయి. అప్పుడప్పుడు ఆ సమావేశాలు రెండేండ్లకొక సారి జరగాలని నిర్ణయించబడింది. ఆ నిర్ణయం ఫలితంగా అష్టమ సమావేశం 1954లో మాంటివిడోలో జరిగింది. నవమ సమావేశం 1956 లో న్యూ ఢిల్లీలో జరుగ నున్నది.

## సభ్యత్వ దేశాలు

ఈ పది సంవత్సరాలలోను అనేక దేశాలు ప్రపంచ వైజ్ఞానిక సంస్థలో సభ్యులుగాను, సహ సభ్యులుగాను చేరాయి. ఈనాడు ఆ సంస్థలో సభ్యత్వంగల దేశాలు ఎనభై వున్నాయి. అందులో సభ్యత్వంగల ప్రతిదేశం 5గురు ప్రతినిధులను, 5గురు ప్రత్యామ్నాయ ప్రతినిధులను, సలహాదార్లను సమావేశానికి పంపవచ్చును. న్యూఢిల్లీలో ఈ సంవత్సరం నవంబరులో జరుగనున్న ప్రపంచ వైజ్ఞానిక సంస్థ నవమ వార్షిక సమావేశానికి వివిధ దేశాలకు చెందిన ప్రతినిధులు అనేకమంది రాగలరు.

ఈ ప్రతినిధులుగాక, ప్రపంచ వైజ్ఞానిక సంస్థ కార్యదర్శి కాలయ సిబ్బందీకూడ ఢిల్లీకి తరలిరానున్నది. వార్షిక సమావేశాన్ని సమర్థవంతంగా నిర్వహించడానికి ఆ సిబ్బందీ ప్రత్యేక కృషిని చేయవల్సి వున్నది. విద్య, వైజ్ఞానిక, సాంఘిక శాస్త్ర విషయక, సాంస్కృతిక రంగాలలో మేధావులైనవారికి స్వాగతమిచ్చే మహదవకాశం భారత దేశానికి తొలిసారిగా లభించింది.

## విధి, బాధ్యతలు

ప్రపంచ వైజ్ఞానిక సంస్థ ఏ విధంగా పని చేసేది వివరిస్తున్నాను. ప్రపంచ వైజ్ఞానిక సంస్థకు పారిస్‌లోని ప్రధాన కార్యాలయంలోను, మరికొన్ని కేంద్రాలలోను, పెద్ద కార్యదర్శి కాలయాలున్నాయి. కొన్ని ప్రత్యేక కార్యక్రమాలను నిర్వహించడానికి ప్రాంతీయ కార్యాలయాలున్నాయి. ప్రపంచ సంస్థకు అధిపతిగా ఒక డైరెక్టరు జనరలు వుంటారు. కార్యదర్శి కాలయంలోని శాఖలన్నీ డైరెక్టరు జనరలు ఆధిపత్యం క్రింద పనిచేస్తాయి. ఆయన క్రింద ముగ్గురు అసిస్టెంటు డైరెక్టరు జనరల్లు, సంస్థయొక్క ప్రతి ప్రత్యేక శాఖకు ఒక డైరెక్టరు వుంటారు. ప్రపంచ సంస్థ ప్రత్యేక శాఖలలో విద్యాశాఖ, వైజ్ఞానికశాఖ, సాంఘిక శాస్త్రశాఖ, సాంస్కృతిక శాఖ, సిబ్బందీ శాఖ వున్నాయి. ప్రతి వార్షిక సమావేశం యిచ్చేటటువంటి ఆదేశాల ననుసరించి ప్రపంచ సంస్థ కార్యకలాపాలను సాగించడానికి, మొత్తంమీద అజమాయిషీ వహించడానికి ఈ సమావేశం ఒక కార్య నిర్వాహక సంస్థను ఎన్నుకుంటుంది. ఈ కార్య నిర్వాహక సంస్థల్లో మొట్టమొదట 18 మంది సభ్యులుండే వారు. కాని మాంటి విడోలో జరిగిన అష్టమ సమావేశంలో రెండు ముఖ్యమైన మార్పులు చేయబడ్డాయి. ఈ సంస్థలోని సభ్యుల సంఖ్య 22 కు పెంచబడింది.

ఆ ఎన్నుకోబడే సభ్యులు ఆయా ప్రభుత్వాల ప్రతినిధులై వుండాలనే క్రొత్త నిబంధన చేర్చబడింది. వార్షిక సమావేశాలకు ఎజెండాలను తయారుచేయడం, వివిధ విషయాలపై అభిప్రాయాలను సమావేశం ఎదుట పెట్టడం ఈ కార్యనిర్వాహక సంస్థ ప్రధాన బాధ్యతలు. ప్రపంచ వైజ్ఞానిక సంస్థకు ఆరోగ్య సంస్థవలె ప్రాంతీయ సంఘాలు లేవు. సభ్యత్వ దేశాలలో నెలకొల్పబడే జాతీయ కమిషన్ల ద్వారా ప్రపంచ సంస్థ తన కార్యకలాపాలను కొనసాగిస్తున్నది. ఈ జాతీయ కమిషన్లు సంవత్సరానికి ఒకసారైనా సమావేశమై సంస్థ నిర్వహణ విషయంలో తగు సూచనలు చేస్తూవుంటాయి.

## ఢిల్లీ సమావేశంలోని కార్యక్రమం

న్యూఢిల్లీలో జరుగనున్న ప్రపంచ వైజ్ఞానిక సంస్థ నవమ సమావేశం 1957–58 వ సంవత్సరపు బడ్జెటును, కార్యక్రమాన్ని చర్చిస్తుంది. ఈ సమావేశ ప్రారంభంలో ప్రతినిధుల పరిశీలన సంఘం నియమించబడుతుంది. ఆ సంఘంవారు సమావేశానికి వచ్చే ప్రతినిధులయొక్క అధికార పత్రాలను పరిశీలించి, వారికి సమావేశానికి అనుమతినిస్తుంది. తర్వాత నామినేషన్ల సంఘం ఏర్పాటు చేయబడుతుంది. వార్షిక సమావేశానికి, వివిధ కమిషన్లు, కమిటీల సమావేశాలకు అధ్యక్షులుగా వుండడానికి ఆ కమిటి ఒక అధ్యక్షుణ్ణి, 10 మంది ఉపాధ్యక్షులను ఎన్నుకొంటుంది. వార్షిక సమావేశం ఏ దేశంలో జరిగితే ఆదేశంయొక్క ప్రతినిధివర్గం నుంచే అధ్యక్షుణ్ణి ఎన్నుకోవాలనేది ఒక సాంప్రదాయం.

## ఉపాధ్యక్షులు

వివిధ దేశాల ప్రతినిధివర్గాల నాయకుల నుంచి పదిమంది ఉపాధ్యక్షులు ఎన్నుకోబడతారు. వార్షిక సమావేశ నిర్వహణలో ముఖ్యమైన కమిటీలు యివి: కార్యక్రమ నిర్ణయ సంఘం, పాలక సంఘం, న్యాయ వ్యవహారాల సంఘం, సభ్యదేశాల నివేదికల పరిశీలన సంఘం. ప్రతి సంఘానికి ఒక అధ్యక్షుడు ఒకరిద్దరు ఉపాధ్యక్షులు వుంటారు.

## తీర్మానాలు

వివిధ సంఘాలు ఆమోదించిన తీర్మానాలు వార్షిక సమావేశం ఎదుట వుంచబడతాయి. సర్వసభ్య సమావేశాలలో మాట్లాడదల్చిన ప్రతినిధులు, డైరెక్టరు జనరలు తమ నివేదికను సమర్పించిన తర్వాత, అధ్యక్షుడు కార్యవర్గం నిర్వహణ కలాపాలపై అభిప్రాయాలను ప్రకటించిన తర్వాత మాట్లాడవచ్చును. ప్రాథమిక సమావేశం వివిధ సంఘాల సభ్యులను ఎన్నుకొని సర్వ సభ్య సమావేశం పూర్తయిన తర్వాత తిరిగి సమావేశమవుతుంది.

ప్రపంచ వైజ్ఞానికసంస్థ కార్యనిర్వహణ పైన వివరించబడింది. ప్రత్యేక విషయాలకు ప్రవీణులతో కూడిన ప్రత్యేక సంఘాలుంటాయి. ప్రపంచ వైజ్ఞానికసంస్థ తరఫున కార్యక్రమాలను నిర్వహించడానికి అంతర్జాతీయ సంస్థలకు కొన్ని లక్షల డాలర్ల ధన సహాయం యివ్వబడుతుంది.

అంతర్జాతీయ స్థాయిలో ప్రభుత్వేతర సంస్థలు దాదాపు నూరింటిని ప్రపంచ వైజ్ఞానికసంస్థ గుర్తించింది. సర్వ సభ్య సమావేశాలకు, పాలకవర్గం సమావేశాలకు ప్రపంచాహారసంస్థ, ప్రపంచ కార్మిక సంస్థ, ప్రపంచ శిశుసంక్షేమసంస్థ మొదలైన ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సంస్థల ప్రతినిధులు పాల్గొని తమకు సంబంధించిన ప్రత్యేక విషయాలను గురించి మాట్లాడుతారు.

## వెనుకబడ్డ దేశాలలో సాగుతున్న కృషి

ప్రపంచ వైజ్ఞానికసంస్థ యీ 10 సంవత్సరాలలోను వెనుకబడ్డ దేశాలలోను, అభ్యుదయ లోపంగల దేశాలలోని అనేక అభివృద్ధి కార్యకలాపాలకు తోడ్పడింది. వైజ్ఞానికసంస్థ విద్యాశాఖ కార్యాలయంవారు ప్రాతిపదిక విద్యాశిక్షణ కేంద్రాలు రెండింటిని నెలకొల్పారు. అవి ఒకటి మెక్సికో

లోను, రెండవది ఈజిప్టులోను వున్నాయి. అక్కడ అధ్యాపకులకు శిక్షణ యివ్వబడుతున్నది. అణుశక్తిని శాంతికాలపు ప్రయోజనాలకు వినియోగించేందుకు స్విట్జర్లెండులో ఒక అంతర్జాతీయ కేంద్రం నెలకొల్పబడింది. కలకత్తాలో యిటీవల అంతర్జాతీయ సాంఘిక విజ్ఞానకేంద్రం నెలకొల్పబడింది. న్యూఢిల్లీ, జకార్తా, బాంకాక్, మాంటివిడోలలో వైజ్ఞానిక సహకార కేంద్రాలు నెలకొల్పబడ్డాయి.

## ప్రధాన కర్తవ్యం

సాంకేతిక సహాయసంస్థతో సన్నిహిత సహకార సంబంధాలు కలిగివుండి, అనేక దేశాలకు అధ్యాపకులను, శిక్షణపొందిన సిబ్బందినీ, పరికరాలను సమకూర్చడం ప్రపంచ వైజ్ఞానికసంస్థయొక్క ప్రధాన కర్తవ్యం. సాంకేతిక సహాయ కార్యక్రమం, ఈ సంస్థ కార్యకలాపాలను ద్విగుణీకృతంచేసింది. భూగర్భ శాస్త్ర సంవత్సరాన్ని నిర్ణయించడంలో ప్రపంచ వైజ్ఞానికసంస్థ హెచ్చు బాధ్యత వహించింది.

## పెద్ద ప్రాజెక్టులు

ఈ సంవత్సరం సర్వ సభ్య సమావేశం ఆమోదించే పక్షంలో అమలుజరుపబడే పెద్ద ప్రాజెక్టులలో యీ క్రిందివి వున్నాయి. 1. లాటిన్ అమెరికాలో ప్రాథమిక విద్యను విస్తరింపచేయడం, 2. అనావృష్టి మండలంలో పరిశోధనలు 3. ప్రాక్పశ్చిమ సాంస్కృతిక విలువల పరస్పర ప్రశంస. అణుశక్తియొక్క శాంతికాలపు ప్రయోజనాలు, ఉష్ణమండల ప్రాంత సమస్యలు సాంఘిక విజ్ఞానబోధన, వస్తుప్రదర్శన కేంద్రాలు అంతర్జాతీయ సంస్థకు ప్రోత్సాహం, నాటకశిక్షణ కేంద్రాలు ప్లాస్టిక్ కళ, కలంక్లబ్బులు, మొదలైనవి తలపెట్టబడిన కార్యక్రమంలో చేరి వున్నాయి. ప్రపంచం కాపీరైటు ఒప్పందం, అంతర్జాతీయ గ్రంథ వినిమయానికి నిబంధనల తయారీ, మానవజాతి సాంస్కృతిక సంపద పరిరక్షణ, గ్రంథాలయాల అభివృద్ధి, దృశ్యవిద్య మొదలైన వాటిపై చర్చలు జరుగుతాయి. మానవజాతి సాంస్కృతిక వైజ్ఞానిక చరిత్రను రచించడానికి కృషి జరుగనున్నది. వివిధరంగాలకు సంబంధించిన కార్యకలాపాలలోను ప్రపంచ వైజ్ఞానికసంస్థ సాంకేతిక సహాయశాఖ ద్వారా అనేక ఫెల్లోషిప్పులను యిస్తున్నది. ప్రపంచ వైజ్ఞానికసంస్థ తలపెట్టిన బహుముఖకృషి, దూరదృష్టితోను దృఢవిశ్వాసంతోను కొనసాగితే ఆశ్చర్యకరమైన ఫలితాలు చేకూరగలవు. అన్ని ప్రపంచదేశాల మధ్య శాంతి సౌహార్ధలను పెంపొందించడానికి, విజ్ఞానాన్ని అందరికీ పంచిపెట్టడానికి, ఈ సంస్థ విశేషంగా పాటుపడుతున్నది.

## ప్రపంచ వైజ్ఞానికసంస్థ-భారత దేశం

ఐక్యరాజ్యసమితి దాని ప్రత్యేక సంస్థల కార్యకలాపాలలో భారతదేశంపాత్ర ఏమిటి అనే ప్రశ్న అది తరచుగా వినవస్తున్నది. ఆ ప్రశ్నకు భారతీయుడైనవాడు సమాధానం చెప్పడంలో సబబులేదు.

ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సంస్థలలోని అనేక సంస్థలలో భారతదేశం గురుతర బాధ్యతలను స్వీకరించింది. ప్రపంచశాంతి భద్రతలను, సర్వమానవ సంక్షేమాన్ని సాధించాలనే పవిత్ర ఆశయంకోసం భారతదేశం శాయశక్తులా కృషి చేస్తున్నది.

ప్రపంచ వైజ్ఞానికసమితి విషయంలో, ఒక ప్రముఖ భారతీయుడు సమితి సమావేశానికి అధ్యక్షుడుగాను మరొక యిద్దరు భారత ప్రతినిధులు పాలకసంస్థ అధ్యక్షులుగాను పనిచేశారు. భారత ప్రతినిధివర్గంయొక్క వైఖరి యితర సభ్యత్వ దేశాలకు నచ్చకపోవచ్చు. భారతదేశం ఆ విషయాలను గమనించేవుంది. ఐక్యరాజ్యసమితి ఆశయాలను, లక్ష్యాలను సాధించడానికి కృషిచేయడమే భారతదేశ లక్ష్యమని పోను పోను అందరికీ తెలుస్తుంది.

ఆయుధోత్పత్తి పెంపుదల మారణాయుధాల తయారీ, అమాయిక ప్రజలపై వాటి ప్రయోగం మొదలైనవి ప్రపంచ వినాశానికేగాని సముద్ధరణకు తోడ్పడవని గుర్తించబడింది.

అహింసా సూత్రంద్వారా, ఐక్యరాజ్యసమితి ఆశయాలకు భంగంకలగకుండా, ప్రపంచశాంతి భద్రతలను సాధించడానికి, ప్రపంచ దేశాలమధ్య స్నేహ సౌహార్దాలను పెంపొందించడానికి భారతదేశం శాయశక్తులాకృషి చేస్తున్నది. ఈ మహత్తరకృషి యిక ముందుకూడసాగి, అంతిమ లక్ష్యాన్ని చేరగలదని ఆశిద్దాము.

లోను, రెండవది ఈజిప్టులోను వున్నాయి. అక్కడ అధ్యాపకులకు శిక్షణ యివ్వబడుతున్నది. అణుశక్తిని శాంతికాలపు ప్రయోజనాలకు వినియోగించేందుకు స్విట్జర్లెండులో ఒక అంతర్జాతీయ కేంద్రం నెలకొల్పబడింది. కలకత్తాలో యిటీవల అంతర్జాతీయ సాంఘిక విజ్ఞానకేంద్రం నెలకొల్పబడింది. న్యూఢిల్లీ, జకార్తా, బాంకాక్, మాంటివిడోలలో వైజ్ఞానిక సహకార కేంద్రాలు నెలకొల్పబడ్డాయి.

## ప్రధాన కర్తవ్యం

సాంకేతిక సహాయసంస్థతో సన్నిహిత సహకార సంబంధాలు కలిగివుండి, అనేక దేశాలకు అధ్యాపకులను, శిక్షణపొందిన సిబ్బందినీ, పరికరాలను సమకూర్చడం ప్రపంచ వైజ్ఞానికసంస్థయొక్క ప్రధాన కర్తవ్యం. సాంకేతిక సహాయ కార్యక్రమం, ఈ సంస్థ కార్యకలాపాలను ద్విగుణీకృతంచేసింది. భూగర్భ శాస్త్ర సంవత్సరాన్ని నిర్ణయించడంలో ప్రపంచ వైజ్ఞానికసంస్థ హెచ్చు బాధ్యత వహించింది.

## పెద్ద ప్రాజెక్టులు

ఈ సంవత్సరం సర్వ సభ్య సమావేశం ఆమోదించే పక్షంలో అమలుజరుపబడే పెద్ద ప్రాజెక్టులలో యీ క్రిందివి వున్నాయి. 1. లాటిన్ అమెరికాలో ప్రాథమిక విద్యను విస్తరింపచేయడం, 2. అనావృష్టి మండలంలో పరిశోధనలు 3. ప్రాక్పశ్చిమ సాంస్కృతిక విలువల పరస్పర ప్రశంస. అణుశక్తియొక్క శాంతికాలపు ప్రయోజనాలు, ఉష్ణమండల ప్రాంత సమస్యలు సాంఘిక విజ్ఞానబోధన, వస్తుప్రదర్శన కేంద్రాలు అంతర్జాతీయ సంస్థకు ప్రోత్సాహం, నాటకశిక్షణ కేంద్రాలు, ప్లాస్టిక్ కళ, కలంస్నేహాలు, మొదలైనవి తలపెట్టబడిన కార్యక్రమంలో చేరి వున్నాయి. ప్రపంచం కాపీరైటు ఒప్పందం, అంతర్జాతీయ గ్రంథ వినిమయానికి నిబంధనల తయారీ, మానవజాతి సాంస్కృతిక సంపద పరిరక్షణ, గ్రంథాలయాల అభివృద్ధి, దృశ్యవిద్య మొదలైన వాటిపై చర్చలు జరుగుతాయి. మానవజాతి సాంస్కృతిక వైజ్ఞానిక చరిత్రను రచించడానికి కృషి జరుగనున్నది. వివిధరంగాలకు సంబంధించిన కార్యకలాపాలలోను ప్రపంచ వైజ్ఞానికసంస్థ సాంకేతిక సహాయశాఖ ద్వారా అనేక ఫెల్లోషిప్పులను యిస్తున్నది. ప్రపంచ వైజ్ఞానికసంస్థ తలపెట్టిన బహుముఖకృషి, దూరదృష్టితోను దృఢవిశ్వాసంతోను కొనసాగితే ఆశ్చర్యకరమైన ఫలితాలు చేకూరగలవు. అన్ని ప్రపంచదేశాల మధ్య శాంతి సౌహార్ధలను పెంపొందించడానికి, విజ్ఞానాన్ని అందరికీ పంచిపెట్టడానికి, ఈ సంస్థ విశేషంగా పాటుపడుతున్నది.

## ప్రపంచ వైజ్ఞానికసంస్థ-భారత దేశం

ఐక్యరాజ్యసమితి దాని ప్రత్యేక సంస్థల కార్యకలాపాలలో భారతదేశంపాత్ర ఏమిటి అనే ప్రశ్న-అది తరచుగా వినవస్తున్నది. ఆ ప్రశ్నకు భారతీయుడైనవాడు సమాధానం చెప్పడంలో సబబు లేదు.

ఐక్యరాజ్యసమితి ప్రత్యేక సంస్థలలోని అనేక సంస్థలలో భారతదేశం గురుతర బాధ్యతలను స్వీకరించింది. ప్రపంచశాంతి భద్రతలను, సర్వమానవ సంక్షేమాన్ని సాధించాలనే పవిత్ర ఆశయంకోసం భారతదేశం శాయశక్తులా కృషి చేస్తున్నది.

ప్రపంచ వైజ్ఞానికసమితి విషయంలో, ఒక ప్రముఖ భారతీయుడు సమితి సమావేశానికి అధ్యక్షుడుగాను మరొక యిద్దరు భారత ప్రతినిధులు పాలకసంస్థ అధ్యక్షులుగాను పనిచేశారు. భారత ప్రతినిధివర్గంయొక్క వైఖరి యితర సభ్యత్వ దేశాలకు నచ్చకపోవచ్చు. భారతదేశం ఆ విషయాలను గమనించేవుంది. ఐక్యరాజ్యసమితి ఆశయాలను, లక్ష్యాలను సాధించడానికి కృషిచేయడమే భారతదేశ లక్ష్యమని పోను పోను అందరికీ తెలుస్తుంది.

ఆయుధోత్పత్తి పెంపుదల మారణాయుధాల తయారీ, అమాయిక ప్రజలపై వాటి ప్రయోగం మొదలైనవి ప్రపంచ వినాశానికేగాని సముద్ధరణకు తోడ్పడవని గుర్తించబడింది.

అహింసా సూత్రంద్వారా, ఐక్యరాజ్యసమితి ఆశయాలకు భంగంకలగకుండా, ప్రపంచశాంతి భద్రతలను సాధించడానికి, ప్రపంచ దేశాలమధ్య స్నేహ సౌహార్ద్రాలను పెంపొందించడానికి భారతదేశం శాయశక్తులాకృషి చేస్తున్నది. ఈ మహత్తరకృషి యింక ముందుకూడసాగి, అంతిమ లక్ష్యాన్ని చేరగలదని ఆశిద్దాము.

―――(౦)―――

# గాలిపడగలు

శ్రీ కోకా బాలకృష్ణరావు

(గతసంచిక తరువాయి)



'అదికాదు నేననేది – మరీ మీ ఆరో గ్యాన్నికూడా లెక్కచేయకుండా...'

భర్తభావం గ్రహించి ఆమె అక్కడితో ఆగిపోయింది.



విశ్వనాథంకూతురు రాజ్యలక్ష్మికి ఇప్పుడు ఆరోనెల. మళ్లీ ఇంత కాలానికి ఆ యింట్లో లక్ష్మి వెలిసింది.

ఈ సారి రాజయ్య భార్య తులశమ్మ అనుకుంది. మళ్లీ తమ కుటుంబంలో ఆశలు చిగురించాయని.

ముసలమ్మది ఒక విచిత్రప్రకృతి – తమ సంసారంలో జరిగిన దారుణమైన మార్పులకి తట్టుకొని, రాయిగామారిన ఆమె గుండె మళ్ళీ వెనకటి విషయాలు గుర్తుకు వచ్చినప్పుడు ద్రవిస్తూ వుంటుంది.

కాసేపు ఇంట్లో కూర్చుంటె ఎప్పుడూ వరండాలో పచార్లు చేస్తుండే భర్త, అనుక్షణం గోడమీద విశ్వరూపంలా మనసు నిండా పరుచుకునే పెద్ద కొడుకు పసుపు బట్టల పెళ్లిఫోటోలోని రూపం ఆమె కళ్ల ముందు ప్రత్యక్షమౌతాయి.

ఆ గోడమీదఫోటో తీసేయలేదు. ఆ యింట్లో క్షణం కూర్చోలేదు. రాజ్యలక్ష్మి పుట్టిన తర్వాత ముసలమ్మ దిన చర్యలో కొద్ది మార్పులు వచ్చాయి.

ఆ పిల్లకి నీళ్లుపోయటం దగ్గర్నుంచి చంటి పిల్ల పనంతా ముసలమ్మే చూసేది. రాజేశ్వరి మాత్రం మడికట్టుకొని వంటచేసేది. మధ్యాహ్నం భోజనాలయిం తర్వాత కాస్త కునుకుతీయటం, మళ్లీ సాయంత్రం లక్ష్మికి వళ్లుకడిగి, తెల్లటి గౌనుతొడిగి, చంకన వేసుకు బయలుదేరటం, ఇదీ ముసలమ్మదినచర్య.

ఆమె ఎప్పుడన్నా ఇంటిపనుల్లో జోక్యం కల్గించుకుంటే 'వద్ద'నేవారూ లేరు. కలిగించుకోకపోతే వాపోయేవారూ లేరు.

పిల్లనెత్తుకొని దారినపోయే ముసలమ్మని పరామర్శించేవాళ్లు 'నీకేమమ్మా! గుమ్మడి పండులాంటి మనవరాల్ని ఎత్తుకున్నావ్' అని ఇరుగు పొరుగువాళ్లు.

అట్లా అట్లా తిరిగి ముసలమ్మ ఆఖరికి ఎవళ్ల ఇంట్లోనో ఒకమూల కూర్చొని, మనవరాలుతోపాటు తనూ ఆడుకునేది.



రాజేశ్వరికి తెలుసు తమ జీవితాలు ఇంతకంటె ఉచ్ఛస్థితికి ఎన్నడూ వెళ్లలేవని – కాని ఉన్నదాంట్లోనే ఎందుకు ఆనందాన్ని సృష్టించుకోకూడదు!

రాత్రింబవళ్లు శరీరాన్ని కష్టపెట్టి, ఏవో అందనిఫలాలకి ఆశించి జీవితంలో నిరాశ పెంచుకోవటంతప్ప రాజేశ్వరికి విశ్వనాథం ప్రవర్తనలో మరేమీకనుపించ లేదు.

డబ్బు సంపాదించటానికి, తెల్లవారి లేచిన దగ్గర్నుంచి విశ్వనాథం వెతికే ఉపాయాలు అనంతం. అట్లా అని విశ్వనాథం పీనాసి అనటానికి అంతకన్నా వీలు లేదు.

పెళ్లైన ఇంతకాలానికి, రాజేశ్వరి విశ్వనాథంతో కలిసి, ఒక్క సినిమాకి వెళ్లలేదు. తన కన్నుల పండువగా ఆయన ఒక్కరోజు మంచి చొక్కా తొడుక్కోలేదు. ఇటువంటివే రాజేశ్వరికి కనుపించే కొన్ని కొన్ని లోపాలు.

కర్తవ్యభారంతో ఊపిరి సలపటానికే తీరికలేని ఆయనకి విలాసాలకి, వినోదాలకీ వ్యవధెక్కడిది!

బండిచక్రం దొర్లుతున్నకొద్ది దూరం తరుగుతుంది.

జీవితచక్రం దొర్లుతున్నకొద్ది గమ్యం దగ్గరౌతుంది.

తాను బ్రతికిన యీ పాతిక సంవత్సరాల్లో తను సాధించినదేమిటి ?

అప్పుడప్పుడూ విశ్వనాథం వేసుకునే ప్రశ్న యిది.

దీనికి విశ్వనాథానికి తట్టే జవాబు కేవలం శూన్యం.

మండే జీవితపు ఎడారిలో, నడిమధ్యన నించొని వెనక్కితిరిగిచూస్తే కనుపించేది పెద్ద శూన్యం.

ముందుకుచూస్తే కనిపించేది మరొక పెద్ద అగమ్యం.

జీవితమే ఒక నిరంతర సంఘర్షణ.

ఇది విశ్వనాథం స్థూలాభిప్రాయంలో నుండి లాగిన సూక్ష్మభావం.

♦ ♦ ♦

విశ్వనాథంది విచిత్ర ప్రకృతి. తను గడిపే జీవితంలో అనుక్షణం అసంతృప్తి ఏదో వ్యక్తమవుతూనే వుంటుంది. అంతకంటే తృప్తిగా గడపటానికి ఇంకా మార్గంలేదు. అది అతనికీ తెలుసు. కాని అతనిలోవుండే ఒక విధమైన మానసిక బలహీనత అట్లా బాధిస్తూవుంటుంది.

విశ్వనాథం, కాంతారావు ఒక ఈడు వాళ్లు. విశ్వనాథం సైకెండు చదివిన రెండేళ్లు కాంతారావుతో గడిపాడు వాళ్ల వూళ్లో. అతన్ని బాగా అర్థంచేసుకున్న కాంతారావు అనుకున్నాడు 'వీడే తల్లిదండ్రులను సుఖపెట్టగలవాడు' అని.

మిగతావాళ్ల దృష్టిలో విశ్వనాథం అప్పటికే ఒక 'సినిక్'.

♦ ♦ ♦

ఒకరోజు కాలేజీనించి వచ్చిన కాంతారావుకి మూడుకాళ్ల కార్డుముక్క అందించిందొక విషాదకరమైనవార్త.

దాంట్లో 'విశ్వనాథం కలరావచ్చి, హఠాత్తుగా చనిపోయా'డనివుంది.

కాంతారావు అప్రతిభుడయ్యాడు.

మండేజ్వాలలో ఎండుకట్టెల్లా ఒకదాని వెంట ఒకటిగా ఆ కుటుంబానికి కలిగే దుఃఖాలకి మనసులో కాస్త సానుభూతి మాత్రం చూపించగలిగాడు కాంతారావు.

రాజయ్య మరణంతోనే సంబంధాలు కొద్దిగా సడలిన బాంధవ్యం ఇప్పుడు మరీ పలుచబడ్డది.

నాలుగేళ్లు గడిచాయి.

మళ్ళీ ఎవరూ కలుసుకోలేదు.

3

అనుకోకుండా అంతవరకూ వెళ్ళిన కాంతారావుకి అక్కడికి వెళ్లటం ఎంతైనా భావ్యమనిపించింది.

వాకిట్లో అడుగుపెట్టిన కాంతారావుకి మొదటగా కనిపించింది నారాయణ. మసకచీకటైనా, గొంతునుబట్టి కాంతారావుని గుర్తుపట్టగలిగాడు నారాయణ.

కాళ్లు కడుక్కునేందుకు నీళ్లిచ్చి, నులక మంచంవాల్చాడు.

'ఎవరూ!...' అంటూ ఇంట్లో వంట చేస్తున్న ముసలమ్మవచ్చి కాసేపు కుశల ప్రశ్నలువేసింది.

నాలుగుమూలలా పరికించిన కాంతారావుకి ఒక మూలగా వాకిటున్న రాజేశ్వరి కనిపించింది.

వరండాలో చిన్నబుడ్డిదీపం మాత్రం వెలుగుతోంది. ఏమూల ఏమున్నదో స్పష్టంగా కనిపించటంలేదు.

కాస్త పరీక్షగాచూచిన కాంతారావుకి రాజేశ్వరివళ్లో ఐదేళ్లపిల్ల కనిపించింది.

ముఖంలో ముఖంపెట్టిన ఆ పిల్లకి తల్లి ఏదో చెవులో చెప్పింది.

కాంతారావు పిలిచాడు ఆ పిల్లని ఆప్యాయంగా.

తల్లి గాను ఊడదీసి ముందుకునెట్టినా ఆ పిల్ల కొంచెం భయపడ్డది.

'రామ్మా...ఇదుగో! ఎవరో చుట్టాలొచ్చారు చూడు మనింటికి!' అని పిలిచాడు నారాయణ.

నారాయణ బాబాయంటే బాగా చనువు ఆ పిల్లకి.

రెండడుగులువేసిన ఆ పిల్లని అమాంతం పట్టుకున్నాడు కాంతారావు. కాస్త దడిసిన ఆ పిల్లకి ధైర్యంచెప్పాడు వాళ్లి నారాయణ బాబాయి.

'అమ్మా నీ పేరేమిటి!' అని బుజ్జగించాడు కాంతారావు.'

'రాజాలు'

'రాజ్యలక్ష్మి కాదమ్మా' అని దిద్దాడు నారాయణ

'రాజలక్ష్మి...' అని కాంతారావు భుజాల వెనుక తలదాచుకుంది రాజాలు.

క్రమంగా రాజాలుకి కొత్త దనం పోయింది. భోజనం దగ్గర ఇద్దరి మధ్య కూర్చొని అప్పుడప్పుడూ నారాయణబాబాయి దగ్గిర ఒక ముద్ద తింటూ కబుర్లు చెప్పింది రాజాలు.

అక్కడున్న కాసేపట్లో ఆ పిల్లనిదించ బుద్ధివేయలేదు కాంతారావుకి. ఆ పిల్లని ఎత్తుకున్నప్పుడల్లా బల్లిలా అతని హృదయానికి హత్తుకు పోయేది. ముద్దు పెట్టుకో బోతే తేలిగ్గా బుగ్గని అందించేది.

అట్లా ఆ పిల్ల తన హృదయానికి హత్తుకున్నప్పుడు హటాత్తుగా విశ్వనాథం గుర్తుకువచ్చేవాడు కాంతారావుకి. 'పచ్చటి వన్నెతో మెరిసిపోతున్న ఈ పాపని, చందమామలాటి అందాలు చిందే ఈ పాపని ఇట్లా హృదయానికి హత్తుకునే అదృష్టం విశ్వనాథానికి లేకపోయింది కదా!' అనుకున్నాడు.

వాకిట్లో రాజేశ్వరి మోకాలిమీద ముఖం ఆనించుకొని ఈ దృశ్యాన్ని చూస్తూనే వుంది. కాని ఆమె ముఖంలో ఏం భావాలు అప్పుడు ప్రతిఫలిస్తూన్నాయో కాంతారావు చూడలేక పోయాడు ఆ మసక వెలుగులో.

♦ ♦ ♦

విశ్వనాథం చావుతో, పూర్తయిన నారాయణ ఇంటర్ చదువు అతి ప్రయాస మీద ఆ ఫూరు పంచాయితీ బోర్డులో ఒక గుమాస్తాగిరీ సంపాయించి పెట్టింది.

విశ్వనాథం ఆ ఇంట్లో వెలిగించిన ఒక చిన్న ప్రమదలో జ్యోతికి నారాయణ నూనె పోస్తూనే వున్నాడు. నాలుగు మూలలా వ్యాపించిన చీకటిని చీల్చుకొని ఆ వెలుగు రేఖలు ఆ యింటిని దీప్తం చేస్తూనే వున్నాయి.

## 4

అరుణోదయమైంది.

అనుక్షణం విశ్రమించకుండా శ్రమ చేస్తున్న మానవుడు సాధిస్తున్న దేమిటి?

విశ్వనాథం తను బతికున్నంత కాలం జీవితంలో ఇదమిద్ధమని చెప్పలేని లోపాన్ని ఎందుకు 'ఫీ'లయ్యాడు!

ఆ మాటకొస్తే లోకంలో ఎవరు మాత్రం ఏం సాధిస్తున్నారు. పాతికేళ్లుపై బడ్డ తను ఇంతవరకూ ఏం సాధించాడు!

నలుగురి బిడ్డల్ని కన్న తన తాత ఏం సాధించాడు!

ఇద్దరు బిడ్డల్ని కన్న తన తండ్రి ఏం సాధించాడు!

సంసారం—పిల్లలు!

కష్టం—సుఖం!

ఒక విధమైన నిర్లిప్తతతో జీవించటమే జీవితానికి ఉత్తమ మార్గం.

కాంతారావు ఒక అనంతమైన సమస్యకి హద్దులు నియమించుకున్నాడు.

అతడి దృష్టిలో విశ్వనాథం కర్మిష్టి. తనకున్న సంసారాన్ని బట్టి, తను చీకట్లో ప్రవేశించాననీ, ఈ జీవిత అయస్కాంత వలయంలో అనిచ్ఛా పూర్వకంగా పరిభ్రమిస్తున్నాననీ, తను చేసిన ఏపనీ తన ప్రతిభవల్ల సాధించింది కాదనీ, అది కేవలం కర్తవ్య నిర్ణయమేననీ అనుకోవటం చనిపోయిన విశ్వనాథం తత్త్వం.

తన భర్త అహరహమూ కష్టించి, అసలే దుర్బలమైన మనస్సుని, దేహాన్ని లోకంకోసం ఎందుకు బలి యివ్వాలి?

ఆయనతోనే నూరేళ్లు వెళ్లాలనుకున్న తన బ్రతుకుని అంధకారంచేసి, అప్పుడే ఈ లోకంలో అడుగుపెట్టిన ఒక అమాయకమైన పసి పాప జీవితాన్ని గాలికి వదిలేసి ఒంటరిగా ఎక్కడికో నిష్క్రమించిన తన భర్త సాధించిందేమిటి?

ఇది రాజేశ్వరి మూర్ఖంగా తనను తాను ప్రశ్నించుకున్న ప్రశ్న.

జీవితాన్ని గురించి ప్రశ్నించే, ప్రశ్నించుకునే హక్కు మనం స్వతంత్రించి తీసుకున్నా దానికి జవాబు మాత్రం ఏ కోణం నించికూడా రాదు.

లోకంలో, కాలంలో, జరుగుతున్న ప్రతి పరిణామానికీ హద్దులను, ఫలితాలను నిర్ణయించటానికి ఎవరికి హక్కు వుంది?

సృష్టి - స్థితి - లయ.—

కాలమనే పదార్థాన్నికూడా తీసుకుంటే ఈ నాలిగింటి మధ్యా నాలుగుస్తంభాలాట ఆడుతోంది కర్మ సిద్ధాంతం.

జీవితం ఈ కర్మ సిద్ధాంతవలయంలో తిరుగుతున్న ఒక జడ పదార్థం.

సామాన్య మానవుడు ఈ ప్రపంచంలో సాధించేది ఏదీ లేదు.

◆ ◆ ◆

ఆకాశంలో అరుణిమలు పూర్తిగా అంతరించాయి. తిరుగు ప్రయాణం సాగించిన కాంతారావుకి ఒక మూలగా చేతనావస్థలో కూర్చున్న రాజేశ్వరి, నారాయణ బాబాయి మంచంమీద అమాయకంగా నిద్ర అలలమీద తేలిపోతున్న పరమాత్మ స్వరూపం పసిపాపా కనిపించారు.

ఆ పల్చటి పెదవుల వెనుక, మెరిసే వెలుగు రేఖలా నిద్రలో అమాయకంగా నవ్వుకుంటున్న రాజాలు పాల బుగ్గలపై కడసారిగా ఒక ముద్దు వుంచి, వాకిట్లో తన కోసం కనిపెట్టుకున్న నారాయణని అనుసరించాడు కాంతారావు.

సమాప్తం

# తెల్లరోజా!


రచయిత్రి :
ఇన్ గే షోల్

అనుసరణ :
డాక్టరు వి. ఎన్. శర్మ


## అనుకోని సంఘటనలు

## I

### అప్పటి పరిస్థితులు

[ వ్యక్తి స్వాతంత్ర్యానికి, ఆ మార్గానే దేశ స్వాతంత్ర్యానికి, లోక కల్యాణానికీ త్యాగం చేసి ధన్యతగాంచిన జర్మను విద్యార్థుల, విద్యార్థినుల వీర గాథ నిందులో చిత్రింప బడ్డది. కథారంగం జర్మను దేశంలో-కాలం హిట్లరు ప్రజా స్వాతంత్ర్యాన్ని చిందర వందర చేయడానికి భగీరథ ప్రయత్నం చేసిన యుద్ధకాలం. అంటే 1938-45 సంవత్సరాల మధ్య. ఈ గాధని చిత్రించిన ఇన్ గే షోల్ విద్యార్థి వీరుల త్యాగాన్ని కళ్ళార చూసింది. ఈమె తమ్ముడు హాన్స్, చెల్లి సోఫీ, వాళ్ల స్నేహితులు అలెగ్జాండర్, క్రిష్టల్ మొదలగువారూ, వారి ప్రొఫెసర్ హ్యూబరూ ఆ కాలంలో చేసిన సాహస కార్యాలు, వాటి మూలంగా వారు ఎదుర్కొనాలసి వచ్చిన యమయాతనలను, ఈ రచయిత్రి తన శిల్పంలో చక్కగా చిత్రించింది.

ఇంతవరకు ఈ వీరుల విద్యార్థి కాలాన్ని వివరంగా తెలిపాను. ఆ కాలంలో వారు హిట్లరు నాజీ యుద్యమాన్ని ప్రతిఘటించటానికి చేసిన త్యాగాన్ని తెలిపాను. యుద్ధకాలంలో జరుగుతూవున్న కథను యథాతథంగా తెలుపడానికి వారు స్వయంగా తయారుచేసి అన్ని చోట్లా పంచి పెట్టిన ''తెల్లరోజా'' కర పత్రాలను గురించి పాఠకులు విన్నారుకదా! తరువాత కథను ఇక చదువుతారు పాఠక మహాశయులు. ]

జయం మనదే అనే జయధ్వానాలకి అంతూ పంతూ అనేది వుంటేగా ఆ రోజుల్లో - యుద్ధం అటు పశ్చిమ రంగాన, ఇటు తూర్పురంగాన హోరాహోరిగా జరుగుతూవున్న ఆ రోజుల్లో — ప్రతిరోజూ సైనిక దుస్తులను ధరిస్తూ పిన్నలూ, పెద్దలూ తండోప తండాలుగా జర్మను దేశాన్నుంచి యుద్ధరంగాలకి వెడుతూ వున్నారు. ఎంతమంది వెళ్ళినా, ఆ యుద్ధదేవత శాంతించితేగా! వచ్చినవాళ్లనందరినీ ఆ దేవత పెడుతూవున్న యాతన ఇంతింతని చెప్పడానికి మొదలెట్టితేనా ? ... ప్రజాకోటి హిట్లరు తన పట్టు నెగ్గించుకొనటానికి చేస్తూవున్న ప్రచారాన్ని నమ్మారు. ...నమ్మారుకాదు, తప్పనిసరిగ నమ్మాలసివచ్చింది.

నమ్మకపోయారా ఎలాటి అగాధంలోపడి వుక్కిరి బిక్కిరి అయిపోవాలసి వస్తుందో వాళ్లకి బాగా తెలుసు. అది అబద్ధాలపుట్ట.

ఆ అబద్ధాలపుట్టనే అంగీకరించాలి. యుద్ధం హోరా హోరిగా సాగుతూవుంది - ఒకరోజా రెండురోజులా? యుద్ధ జ్వాలలకి తాళుకోలేక సైనికులు పడుతూవున్న యాతనని తలుస్తేనా ? ఆ సంగతి దేశంలో ప్రజలకి ఎలా తెలుస్తుంది ? యుద్ధ రంగానికి వెళ్ళిన సైనికులు తిరిగి ఇంటికి వస్తేగా ! అథవా అక్కడి నుంచి బయలుదేరారా, వాళ్ళని దోవలోనే మాసాల పర్యంతం నిలిపేవాళ్లు; ఉత్తరాలు రావడం ఎప్పుడో ఒకసారి. అలా అవి వచ్చినా వాటిలో వ్రాయబడి వుండేది. "అంతా క్షేమము: జయవార్తని తెలుపడానికి త్వరలో వస్తూ వున్నాము" అనే. అంతకన్నా ఒక మాట ఎక్కువగా వ్రాశారా, ఆ జాబు ఇంటికి రాదు. వ్రాసినవాళ్లు అనుభవిం చాలసిన శిక్షని మాటలతో వివరించ దలచితే ఎటు వంటి కఠిన హృదయంగల వాళ్ళయినా ఆ క్షణాన్నే స్తంభించి పోవాలసి వస్తుంది......

ఇలాటి విషమావస్థలో ఎన్నెన్నో రకాల గాలి వార్తలని ప్రజలు వింటూ వున్నారు. యుద్ధం త్వరలో ముగియ బోతూవుంది. ఆ పనికి అందరూ సహాయం చేయాలి. అలాటిసహాయం ఎంతత్యాగంతోకూడుకొని వున్నా, దానికీ ప్రజాకోటి వెనుకంజ వేయకూడదు. అలా చేయకపోయారా యుద్ధం మరికొంత కాలం సాగాలసి వస్తుంది..........

యుద్ధం త్వరలో ముగియాలంటే సైనికులని పంపాలసిన బాధ్యత జర్మను దేశీయులమీద వుంది. పెద్దలు పనికివస్తారు. పిన్నలూ పనికివస్తారు. అంచేత అందరూ తయారుగా వుండా లనే ప్రచారం ప్రతిరోజా మితి మించిపోతూ వుంది.

ఇలాటి ప్రచారంలో విద్యార్థుల సహాయం, ముఖ్యంగా వైద్య విద్యార్థుల సహాయం అత్యవసరంగా యుద్ధ రంగాల్లో కావలసి వుందని వార్తలని ప్రజలు రేడియోలో అస్తమానమూ వింటూ వున్నారు. తరు వాత కొంత కాలానికి విద్యార్థి బృందం వాళ్ళ చదువు సంధ్యలని చాలించి యుద్ధ రంగాలకి వెళ్ళడానికి తయారుగా వుండాలని ప్రచారం ముమ్మరంగా సాగించారు.

ఇతర రంగాల్లో ఎలావున్నా రష్యను రంగంలో జర్మను సేనలు ఎదుర్కొంటున్న కష్టాలకి అంతూ పంతూ అనేది లేదు. అది చలికాలం. దేశం జర్మను సేనలకి కొత్తది. తిండిలేదు. వైద్య సహాయం లేదు...... ఆ రంగంలో వున్నవాళ్ళ అవస్థ చెప్ప దలిస్తే పెద్ద పురాణమవుతుంది. ఈ రహస్యం జర్మను ప్రజలకు ఎలా తెలుస్తుంది? అథవా ఎవళ్ళయినా ధైర్య సాహసాలు చేసి చెప్పినా ప్రజాకోటి, వోపికతో ఆ సంగతిని వినే స్థితిలో వుంటేకదూ ? ప్రజాకోటికి మత్తు మందు వేశారు. దాన్లో నుంచి తరుణో పాయం వుంటేగా!

## II

## యుద్ధ రంగానికి నడవాలి !

గాలి కబుర్లు క్రమేణా నిజవార్తల క్రిందికి మారి పోయాయి. ఒక రోజున హిట్లరు మిలిటరీ ఆర్డర్లని జారీచేశాడు తనకి నచ్చిన మార్గాల్ని అదురూ బెదురూ లేక అవలంభిస్తూ విద్యార్థులు, కాలేజి విద్యార్థులు, హైస్కూళ్ళ విద్యార్థులు చదువు సంధ్యలని కట్టిబెట్టి తత్క్షణమే యుద్ధరంగానికి బయలు దేరాలని. ఆ సంగతి విన్నాక విద్యార్థిలోకం ఎలా వుక్కిరి బిక్కిరి అయి పోయిందో వుత్తమాటలతో ఎలా వర్ణించడం ! "తెల్లరోజా" కర పత్రాల మూలాన అసలు సంగతిని విశ్వ విద్యాలయాల్లోని విద్యార్థులు, కొంతవరకు గ్రాహ్యం చేసుకున్నారు. యుద్ధాన్ని ప్రతిఘటించ టానికి విద్యార్థులు, వాళ్ళ వాళ్ళ పద్ధతుల్లో ప్రయ త్నాలు చేస్తూనే వున్నారు. కాని వాళ్ళలో గూఢా చారులున్నారు. వాళ్లు పెడుతూవున్న బాధలకి, యమ బాధలకి విద్యార్థులు తట్టుకోలేక తహ తహ పడుతూ వున్నారు. అలా వున్నా అశాంతి, అలజడి ముమ్మరంగా పెరిగిపోతూవుంది విద్యార్థుల్లో.

మ్యూనిచ్ విశ్వ విద్యాలయంలో ఆ రోజుల్లో కలిగిన అలజడిని వర్ణించాలా? "తెల్లరోజా" కర పత్రాలలో చదివిన విషాద ఘట్టాలని ఎలా మరచిపోగలుగుతారు? వాటి నిజా నిజాలు ఎలావున్నా ఇతరులకి మల్లె విద్యార్థిలోకం వాంఛించేది యుద్ధం తక్షణమే ముగియాలని. శాంతి వాతావరణంలో అందరూ కలసి మెలసి జీవించాలని. దాంతో ప్రజాలోకం కుదట బడుతుందనీ విద్యార్థుల ఆశ.

ఆ ఆశని కొనసాగించటానికి అవసరమైన కార్య కలాపాన్ని వాళ్ళ వాళ్ళ మార్గాల్లో విద్యార్థులు చేస్తూ ఆ శుభోదయంకోసం వేచి వున్నారు....... అలాటి మంచిరోజు వస్తేకదూ? దానికి బదులు విద్యార్థులే యుద్ధ దేవతకి ఆహుతి అవడానికి చదువు సంధ్యలని మానేసి యుద్ధరంగానికి వెళ్ళాలి అని ఆజ్ఞ! దానిని ప్రతిఘటించటం ఎలాగు?........

అలా యుద్ధరంగానికి వెళ్ళాలసిన వాళ్ళలో విశ్వ విద్యాలయపు వైద్యశాఖలోవున్న విద్యార్థులు మొదటి లిస్టులోకి వచ్చారు. వాళ్లంతా మరుసటి రోజున యూనివర్సిటీ చదువుకు స్వస్తిచెప్పి ఆ నగరంనుంచి యుద్ధరంగానికి బయలుదేరాలి.



మా తమ్ముడు హాన్స్, వాడి స్నేహితులు అలెగ్జాండర్, క్రిస్టల్, వాళ్ల తత్వానికి అవినాభావ సంబంధం గల మరి కొందరూ ఆ రోజు సాయంకాలాన సమావేశమయ్యారు. అది వాళ్లవీడ్కోలుపు సభ అని అనాలి. అ సభలో పాల్గొనడానికి యూనివర్సిటీ ప్రొఫెసరు హూబర్ హాజరయ్యాడు. చెల్లి సోఫీ కూడా ఆ సభలో వుందని చెప్పడం అనవసరం కదూ. ఆ సమావేశంలో పాల్గొన్న వాళ్ళందరికీ "తెల్లరోజా" కర పత్రాలని పంచి పెట్టడంలో ఏ విధంగానైతేనేం ఒక విధంగా బాధ్యత వుందని చెప్పడమూ అనవసరం. వాళ్ళ విధ్యుక్త ధర్మాలని గురించి విద్యార్థులు చర్చించారు. ప్రొఫెసరు హూబరు వాళ్ల మాటలని శ్రద్ధతో విన్నాడు. విన్నాడు వాళ్లు వాళ్ళ వాళ్ళ మనోభావాలని అదురూ బెదురూ లేకుండా పూర్తిగా చెప్పివేసేనంతవరకు. అందరూ ఆయనకేసి చూడ సాగారు ఆయన ఎలాటి సలహా నిస్తాడో శ్రద్ధతో వినటానికి......ఆయన లేచాడు.

"మీ మాటల్ని విన్నాను. మీ రిలా నిర్భయంగా మీ మనస్సుల్లోవున్న భావాల్ని తెలపటం చూశాక ఎంత సంతోషించానో ఇక నేను చెప్పాలా! ...... మన కర్తవ్యం ఎంతో బాధ్యతతో నిండి వుంది. దానిని ఆచరణలో బెట్టటానికి ధర్మ మార్గాన్నే మనం అనుసరిస్తూ వుండాలి. సత్యాన్నే మరచిపోయామా మన వుద్యమం జయప్రదంగా కొనసాగజాలదు. ప్రభుత్వం ప్రజకి మచ్చుమందు వేసింది. దానికి మించిన అస్త్రాల్ని వుపయోగిస్తూ హిట్లరు ముఠా ప్రజా కోటిని ఎలా తారుమారు చేస్తూవుంది మనకు బాగా తెలుసుగా! మనం ఈ మంతనాల్ని ప్రతిఘటించాలి. మన తెలివి తేటల్ని, శక్తి సంపదలనీ, ఈ ప్రతిఘటనకే ఎట్టి కష్టాలని ఎదుర్కోనాలసి వచ్చినా, వాటి కేమాత్రం భయపడకుండా-వుపయోగించాలి. ఇంతవరకు మీరు చేసిన సేవ ఒకఎత్తు. ముందు చేయాలసిన సేవ మరొక ఎత్తు. మన దేశపు భవిష్యత్తు, పాశ్చాత్య ప్రపంచపు ప్రగతీ ఇలాటి సేవమీదే ఆధారపడి వుంటుంది. మనం ఇలాటి సేవలో ప్రాణాలని కోల్పోవలసి వచ్చినా, ఇతర్లు దీని ఫలాల్ని చవిచూసి ధన్యత గాంచగలరు. ఆ రహస్యాన్ని మాత్రం మీరు ఎలాటి విషమావస్థలోనూ మరచి పోవద్దు" అని ప్రశాంతంగా అన్నాడు ప్రొఫెసరు.

ఒక అబ్బాయి ఆయనకేసి చూస్తూ "మనకీ పనిని చేయటానికి ధైర్యంలేక పోతేనో? ... ... అలాటి పరిస్థితుల్లో మనం వుక్కిరి బిక్కిరి అయిపోవడం చూస్తూ వున్నాంగా! అలాంటప్పుడు మనకు ధైర్యం ఎలా వుంటుంది? దాన్నేగా మనం ఆలోచించాలసింది" అని మెల్లిగా అన్నాడు.

క్రిస్టలుకి ఇలాటి చొప్పదంటు ప్రశ్నలంటే తల నొప్పి. ఇంత అధైర్యంవుంటే పిరికి పందలుకాక

మకేమవుతాం అని క్రిష్టల్ తాపత్రయం. ఆ అబ్బాయి సందేహాన్ని నివారణ చేయడానికి తనే జవాబీయ డానికి ముందంజ వేశాడు :

"ఆ అబ్బాయి అన్న మాటలలో నిజం వుంది. అయినా అలా భయపడుతూవుంటే మన కార్యం యథాతథంగా కొనసాగటానికి బొత్తిగా సాధ్యం కాదు. కష్టాలు వస్తాయి. అలా రాకపోతే త్యాగం అనేది మనలో ఎలా వుంటుంది ?...... పరిస్థితులు విషమించినా మనం అధైర్యపడకూడదు. ముందుకు నడవాలి. చీకటిగా వున్నా సరే, అగ్ని వర్షం ఒక్క పళంగా కురుస్తూవున్నా సరే, అదురూ బెదురూ లేకుండా మన కార్యాన్ని కొనసాగించటమనేదే మన కర్తవ్యం. తక్కిన సంగతులని చర్చిస్తూవుంటే మన పని ఎలా సాగుతుంది ?...... మన బాధ్యతలని మనం గ్రహించాలి. వాటిని తూ చా తప్పకుండా ఆచరణలో నుంచాలి. నాజీ యుద్యమం అనేది మహమ్మారి రోగం. శరీరాన్ని నాశనం చేయటంలో తృప్తిపడే జాడ్యమేగా! మన ఆత్మ శక్తులనే చిందర వందర చేయటానికి ప్రారంభించబడ్డ ఉద్యమం అనే సంగతి మనం మరచిపోకూడదు. ఈ జాడ్యాన్నుంచి మన ప్రజలని రక్షించాలి. అలా రక్షించక పోతిమా దేశం అధ్వాన్న మవుతుంది. అంతేనా ? పాశ్చాత్య ప్రపంచం అధో లోకానికి క్రుంగిపోతుంది...... ఈ సంగతి మనకు తెలుసు... అలా తెలిసికూడా వుదాసీనంగా వుండ దలచామా మనకు అపకీర్తి. మన చదువు సంధ్యలకే అప్రతిష్ఠ తెచ్చినవాళ్ళ మవుతాం......" అని ఎంతో వుద్రేకంతో, ఆవేశంతో అన్నాడు క్రిష్టల్.

ఆ విషయాన్ని గురించి ప్రతి విద్యార్థి తన మనోభిప్రాయాన్ని తెలిపాడు. ప్రొఫెసర్ హుాబరు వాళ్ళకీ విషయంలో ఇయ్యాలసిన వుత్సాహాన్ని, ధైర్య సంపదలని ఇచ్చాడని మరి చెప్పాలా! తెల్లవారేటంతవరకు వాళ్లు ఈ సమస్యను గురించే తర్జన భర్జన చేశారు. ఎన్ని అవరోధాల నెదుర్కొనాలసి వచ్చినా తమ ధర్మ మార్గాన్ని అణుమాత్రమూ దాటమని వాళ్ళంతా తీర్మానించు కున్నారు.

మరునాడు విశ్వ విద్యాలయాన్ని మూసివేశారు. విద్యార్థులు యుద్ధ రంగానికి బయలు దేశారు. అలాటి పరిస్థితుల్లో ఇక తను అక్కడ వుండటం అనవసరమని చెల్లి సోఫీ సామాన్లని సర్దుకుని ఇంటికి వచ్చేసింది.

◆ ◆ ◆

## III
## ఇంటి కల్లోలం!

చెల్లి సోఫీ తిన్నగా ఇంటికి వచ్చిందో లేదో, మా ఇంటి పరిస్థితులూ ప్రశాంతంగా వుంటేగా! ఆరాత్రి నిద్రపోడానికి ప్రయత్నించాను ఆ కబుర్లూ ఈ కబుర్లూ హాయిగా చెబుకుంటూ. నిద్రపట్టి తేనా; సోఫీ మ్యూనిచ్ నగరపు పరిస్థితుల్ని చెబుతూవున్నాక తెల్లవారింది. ఎవర్లో బయటతలుపును దబదబ తడుతూ వున్నారు. ... ...

మా వూరి పోలీసు అధికారి ఇంటిముందు ప్రత్యక్షమయ్యాడు పెద్ద కవరుతో. నాన్నమీద నేరాన్ని మోపారు. నాన్న దానికి ఏం సంజాయిషీ ఇస్తాడో వినకుండానే కోర్టువారు దాన్ని విచారించారట. అలా విచారణచేయడానికి ఆరోజుల్లో జడ్జీలకు గవర్నమెంటువారు సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని ఇచ్చారు. ఆ పనికి అడ్డువచ్చే చట్టాల్ని తాత్కాలికంగా రద్దు చేశారు....... నాన్న నేరస్థుడని రుజువైందట. నాలుగు నెలలు శిక్ష ననుభవించటానికి ఆ రోజున్నే కారాగారానికి వెళ్ళాలని తీర్మానించ బడ్డది......

మా నాన్న ఖైదీలో వున్నాడు. తమ్ముడు హాన్స్, వాడి స్నేహితులూ రష్యను యుద్ధ రంగంలో వున్నారు.

ఇక మాకు మనో శాంతి అనేది ఎలాగుంటుంది! ఇంట్లో అశాంతి. బైట అశాంతి ఆ రోజుల్లో మా జీవిత మంతా అల్లకల్లోల మైన సముద్రంలో దరీ దాపు తెలియక యమయాతన బడుతూవున్న పడవకి మళ్లై పోయింది. గోరుచుట్టు మీద రోకటిపోటు అన్నట్టు బాంబుల వర్షము మా వూరి మీదికే అమాంతంగావచ్చి వేసింది.

(536-పేజీ తరువాయి)

తల కొట్టుకుంటున్న "రాము," యివే యిప్పుడు రంగమ్మకు కళ్లకట్టినట్టగుపిస్తున్న దృశ్యాలు. వాటిని చూస్తుంటే రంగమ్మ గుండెలు చీలిపోయ్యేటట్లున్నాయి. ఇక భరించలేక పోయింది. తన్ను తానే నిందించుకొంది. తన బిడ్డడి సుఖాన్ని ఉపేక్షించిన తనూ ఒక తల్లేనా?

కాని యిందులో రంగమ్మ తప్పుమాత్ర మేముంది? వెంకడు త్రాగుబోతు. పైగా సోమరి. అల్లాంటివాడు మాట నిలుపుకో వడంకూడానా? రేపే కుట్టిచ్చేస్తానంటూ, కొల్తలిచ్చిననాడే రంగమ్మవద్ద 8 అణాల అడ్వాన్సు గుంజేశాడు. అది కాస్తా సారా కొట్టుకు చెల్లుఅయిపోగానే, యిక చెప్పులు కుట్టియివ్వాలన్న విషయంగూడ మఱచి పోయాడు వెంకడు. రెండు మూడుసార్లు రంగమ్మ హెచ్చరిస్తే, "మంచితోల్లింకా రాలేదు. యిదిగో, రేపెల్లుండిలో కుట్టి చ్చేస్తా"నంటూ సాకులుచెప్పి తప్పించు కుంటూవచ్చాడు. కాని యికమీదట రంగమ్మ వాని కుంటిసాకులు వినదలచుకో లేదు. అవతల రాము మండుటెండల్లో బాధపడుతూఉంటే సోమరివెధవ సాకులు చెబుతాడా! పద్నాలుగణాలకు కుట్టియిచ్చే టట్లు మాట్లాడుకొని యుండడంవల్ల, అడ్వాన్సుపోను తక్కిన అరణాలు యిప్పుడే యిచ్చేసి, ఉన్నపళంగా చెప్పులు కుట్టించి తీసికొనిపోవడానికే తీర్మానించుకొంది. అందుకనే ఒక అణా తక్కువకే కట్టె లమ్మేసి, త్వరగా వెంకడి గుడిసె చేరు కొంది.

దూరానుంచే రంగమ్మనుజూచి కాస్త తికమకపడినా, అనుకోకుండానే అరణాలు చేతిలోబడ్డంతో వెంకడి కళ్లు జిగేలు మన్నాయి. తక్షణం ఆ డబ్బుల్తో కొట్టు నుండి సారా తెప్పించుకత్రాగి గట్టిని త్రేన్చాడు. అమితోత్సాహంగా రంగమ్మతో ఆ మాట, యీమాట మాట్లాడుతూ, చెప్పులు కుట్టడం ప్రారంభించి, ఒక గంట కల్లా వానిని దాదాపు ముగింపుస్థితికి దెచ్చాడు. కాని రంగమ్మకు ఎన్నో యుగాలు గడిచినట్లైంది.

"త్వరగా కానీ వెంకడూ! అవతల రాము ఎంత బాధపడుతున్నాడో" - అని అన్నది.

"ఇదో, అయిపోయిందమ్మా, మా తల్లి గదూ, సారా గొంతులో పడ్డట్టేలేదు. ఆ చేత్తోనే యింకో ముంత పోయించమ్మా, చిటికెలో కుట్టేస్తాలే తల్లీ" అని అన్నాడు వెంకడు.

పుల్లలమ్మిన పదణాల్లో రంగమ్మవద్ద మిగిలిందల్లా నాలుగణాలు మాత్రమే. దాంతో రాత్రికి రేప్పొద్దునకు సర్దుకోవాలి. యిది కాస్త వెంకడికిచ్చేస్తే తనకు మళ్లీ రేపు కట్టెలమ్మేదాక తిండి? ... పోనీలే... తాను తినక పోతేనేం?... వరుసగా రెండు

మూడు పూటలు వస్తుండడం తన కలవాటేగా?... అక్కడ రాము కాళ్లకంటె ఎన్నో రెట్లు ఎక్కువగా రంగమ్మ హృదయం బిడ్డకై దహించుకపోతూంది. మిగిలిన నాలుగణాలు వెంకడి చేతిలో బెట్టిందామె. మరి కాస్సేపటికి చెప్పుల జత రంగమ్మ చేతుల్లో కొచ్చేసింది. వయస్సులో నున్నప్పుడు రంగమ్మకు కొత్త బట్టలు కట్టుకోవడమంటే వల్లమాలిన సంబరం. కాని యిప్పుడు తనకు లభించిన యానందం ముందు అవన్నీ ఒక లెక్కా!.... యింటికి పోతూ, పోతూ దార్లో ఎన్నోసార్లు ఆ చెప్పుల్ని తడివిచూచి ఎంతగానో మురిసి పోయింది.—"తన రాము కాళ్లకు ఈ చెప్పులెంత బాగుంటాయో, వాని స్నేహితులుగూడ యీ పనితనాన్ని జూచి ఎంతో మెచ్చుకొంటారు; యివి ఎక్కడివని వాళ్లు రామునడిగితే ఎంతో గర్వంగా తన తల్లి పంపిందని జెప్పుకొంటాడు"— ఇంకా ఎన్నో తీయని ఊహల్తో తేలిపోతూ రంగమ్మ తన గుడిసె చేరుకుంది. రాత్రి పడుకున్న తర్వాతకూడ రెండు మూడు సార్లు లేచి, చెప్పులు భద్రంగా ఉన్నాయో, లేదో జాగ్రత్తగా చూచుకొంది. ఎవరైనా ఎత్తుకుపోతారేమో అన్న భయంతో తుదకు వాటిని తన తలక్రిందనే దాచి పడుకొంది.

రెండు మూడు రోజుల్లో ప్రక్కింటి సిద్దయ్య కొడుకు "శివరి" గ్రామానికెళ్తాన్నట్లు తెలిసింది రంగమ్మకు. అతనివద్ద రాము చెప్పులిచ్చి పంపాలనుకొంది. కాని యింతలోనే ఆమె పేర నొక జాబు వచ్చింది. యింత విశాల ప్రపంచంలోను రంగమ్మకు రాము తప్ప జాబు వ్రాసే వ్యక్తిలేడు. అందుకే యిది రామువద్దనుండి వచ్చిందని తెలుసుకోవడానికి ఆమె కెంతోసేపు పట్టలేదు. ఎప్పుడు జాబు వచ్చినా రంగమ్మ చాల కంగారు పడేది. ఏదో ఆపద అకస్మాత్తుగా ఊడిపడ్డట్టే బాధపడేది. తీరా జాబు చదివించుకొని రాము క్షేమంగా ఉన్నాడని తెలుసుకొన్న తర్వాతనే గాని, అనుమానాల్తో అల్లకల్లోలమై పోయిన ఆమె మనస్సు తిరిగి యథాస్థితికి వచ్చేది కాదు. యీనాడెందుకో ఆ మాతృహృదయం మరీ ఎక్కువగా తహతహలాడ సాగింది. భయాందోళనల్తో రంగమ్మ గడగడ వణికి పోతూంది.— రాముకు జబ్బు చేసిందేమో - ఏం జబ్బో - ఎట్లా ఉందో ఏమో?— యిల్లాంటి శంక లెన్నో ఆమె హృదయాన్ని పీడించ సాగాయి. తుదకెట్లో తెప్పరిల్లి జాబు తీసికొని కిరాణా కొట్టు సుబ్బిశెట్టి దగ్గరకెళ్లింది.

"చూడు బాబు! రాము జాబు వ్రాసినట్టున్నాడు. అతనికే అపాయమూ రాలేదుకదా?" అంటూ జాబును సుబ్బిశెట్టి చేతుల్లో పెట్టింది.

సుబ్బిసెట్టి తాపీగా ఉత్తరాన్నందు కొన్నాడు. మామూలుమల్లెకాక జాబు యింగ్లీషులో వ్రాయబడి ఉంది. యిటునటు త్రిప్పి చూచాడు.

"రంగమ్మోయ్, యీ జాబు నీ కొడుకు దగ్గర్నుండి వచ్చిందిగా అగుపించడంలేదు. యిది యింగ్లీషులో వ్రాసింది. సీతారామయ్య మాష్టరున్నారు జూడు, ఆయన దగ్గరకెళ్లి చదివించుకోవమ్మా" అన్నాడు సుబ్బిసెట్టి.

రంగమ్మకు మూర్ఛవచ్చినంత పనైంది, తనెక్కడికో అధః పాతాళానికి క్రుంగిపోతున్నట్లనిపించింది. కళ్ళనిండా నీళ్లు క్రమ్ముకొచ్చాయి. యింగ్లీషు జాబు! ఎవరు తనకింగ్లీషులో జాబు వ్రాసేవారు? ఏముందీ జాబులో? రాము ఏమైనా.. ...? యిక తట్టుకోలేక పోయింది రంగమ్మ.

"బాబ్బాబు! మళ్లీ ఒకమాటు జూడు, ఏదో ఒక విధంగా చదివిచెప్పు తండ్రీ. ఏట్లా ఉన్నాడు నా రాము"—వణకుతున్న కంఠంతో దీనంగా బ్రతిమాలుకొంది.

"నా కింగ్లీషుకూడ తెలిసేడ్చిందా! మాస్టరుగారి దగ్గరకెళ్లి చదివించుకోవమ్మా" అని అన్నాడు సుబ్బిసెట్టి.

తడబడేకాళ్లతో రంగమ్మ స్కూలు కెళ్ళింది. కాని సీతారామయ్య క్లాసులో పాఠంజెబుతూ కనబడ్డాడు. ఆయనెప్పుడు బయటకువస్తాడా అని వరండా వెలుపలనే ఒదిగినుంచొంది. కాస్సేపటికి మాష్టారు బయటకువచ్చాడు.

"ఎవరమ్మా నీవు? ఏంకావాలి?

"యీ జాబు కాస్త చదివిపెడుదూ బాబూ"

"క్లాసు కెళ్ళాలి – నాకిప్పుడు తీరిక లేదు. యింకెవరినైనా అడిగి చదివించుకో" అంటూ చరచర ప్రక్క క్లాసు కెళ్ళిపోయాడు సీతారామయ్య. రంగమ్మ దిగాలుపడి అట్లాగేచూస్తూ నిలబడిపోయింది. యింకెవరున్నారీయూళ్ళో తనకు యింగ్లీషుజాబుచదివి వినిపించగలవారు? ఊహూఁ ... ఏమైనాసరే-యీసారి మాష్టారిపాదాలైనా పట్టుకొంటానికి నిశ్చయించుకొని అక్కడే గోడకు జారగిలబడ్డది. కొంతసేపటికి గంటకొట్టారు. మాష్టారు బయటకొచ్చాడు. ఆమె యింకా ఎండలో అట్లేనుంచోనుండడం జూచి సీతారామయ్య హృదయం ద్రవించిపోయింది. ఆమెవద్దనుండి జాబునందుకొని గబగబ చదివేశాడు. 'శివరీ' గనుల ఆస్పత్రి పెద్ద డాక్టరు వ్రాసిందాయుత్తరము. అకస్మాత్తుగా దెబ్బతగులడంవల్ల రామును ఆస్పత్రిలో జేర్చారని ఆపరేషన్ కూడ చేశారని, చూడాలనిపిస్తే ఒకసారి వచ్చి పోవలసిందని ఆ జాబులో వ్రాయబడ్డది. సంగతి వినడంతోనే రంగమ్మ పై

ప్రాణాలు పైనే పోయ్యాయి. ఉన్న చోటనే కుప్పగా కూలిపోయింది. స్వయంగా తన కోసరం మృత్యుదేవత వచ్చి, ఎదురుగా నిలబడ్డాకూడ రంగమ్మ యింతగా గాభరాపడేదికాదేమో!

"సరీగాచూడు బాబయ్యా, రాము బాగున్నాడుకదూ" గుక్కిళ్ళు మ్రింగుతూ అడిగింది.

"బాగానే చదివానమ్మా. నిన్నొక సారిరమ్మని వ్రాసుందీజాబులో"

"ఇంతకు ఏమైంది నా రాముకు"

"అకస్మాత్తుగా ఏదో దెబ్బ తగిలిందట"

"ఎట్లా తగిలింది బాబూ"

"అదంతా దీన్లో వ్రాయలేదు"

రంగమ్మకేమీ పాలుపోలేదు. యింత జాబూ చదివించినా రాముకేమైంది బోధపడలేదు. తాను "శివరీ" గ్రామం చేరేదెప్పుడు! ఆ క్రొత్తచోట ఆస్పత్రిని వెదికి కనుక్కోనేదెట్లా? యింకా ఎంతసేపటికి తాను రామును చూడగలిగేది? రాత్రంతా నిముషమొక యుగంలాగ భారంగానే గడిపింది.

పూర్తిగా తెల్లవారకముందే రంగమ్మ 'శివరీ' గ్రామానికి బయలుదేరింది. రాము కోసరం కుట్టించిన చెప్పులజతకూడ తనతో తీసికెళ్ళింది. దారి వెంబడి కనుపించిన పుట్టకు, గుట్టకు సాగిలబడింది. రాముకు పెద్ద దెబ్బేదీ తగలకపోయినట్లైతే గుంట మారెమ్మకు పొంగలిపెడ్తానని కూడ మ్రొక్కుకుంది.

ఎట్లాగో తంటాలుపడి రంగమ్మ ఆస్పత్రిని కనుక్కోగలిగింది. తటతట కొట్టుకొంటూన్న గుండెల్తో రోగులు పరుండియున్న మంచాలన్నీ కలయజూచింది. ఒక నర్సు రంగమ్మను రాము పరుండియున్న మంచం దగ్గరకు తీసుకెళ్ళింది. ఒళ్ళునిండా దుప్పటి కప్పుకొని నీరసంగా పడియున్నాడు రాము. తల్లిని చూడడంతోటే పీలగా ఉన్న అతని ముఖంలో ఏదో కాంతి పొడసూపింది.

"వచ్చావా అమ్మా!"

"అవున్నాయనా!-ఎట్లాఉంది నీకింట్లో. గాయం చాల పెద్దదా రామూ? ఎక్కడ తగిలింది, ఎట్లా తగిలింది బాబూ"

"ఎందుకమ్మా అంత కంగారు? ఏదో చిన్న దెబ్బ తగిలిందంతే; రేపెల్లుండికంతా మానిపోతుంది. యీ మాత్రానికే అమ్మకు జాబువ్రాసి, ఆమె మనస్సుకు కష్టంకలిగించవద్దని డాక్టర్ని కోరాను కాని వారు వింటేనా? పోనీలే నీవూ వచ్చేశావు-అంతే చాలు. అయినా యిదేమంత పెద్ద గాయమని, నీవేమి భయపడకమ్మా-"

"చాల బలహీనంగా మాట్లాడుతున్నావు. తలనొస్తుందా రామూ?"

"అరే...నొప్పీలేదు, గిప్పీలేదు; నాకేం బాగానే ఉన్నానమ్మా; అది సరేగాని ఏదో మూటలాగుందే, ఏందెచ్చావమ్మా నాకు ?"

చిటికెలో రంగమ్మ మూటవిప్పి రాముకై కుట్టించిన చెప్పులనుతీసి బయటపెట్టింది. క్షణకాలంపాటు రాము ముఖం వివర్ణమై పోయింది. తీవ్రమైనవేదన అతని కళ్ళల్లో పొడసూపింది. తల్లి చూచేలోగానే అదంతా అణచేసుకొని, తెచ్చికొన్న చిరునవ్వుతో "బలే! ఎంత బాగున్నాయమ్మా; వెంకడు కుట్టిందేకదూ ? అసలు వెంకడు చెప్పులు కుట్టినట్టు యింకెవడు కుట్టగలడు ? వీటిని నాస్నేహితులు జూస్తే నిజంగా ఎంతో యీర్ష్యపడతారు. వీటి అందం, పనితనం జూస్తుంటే కాళ్ళకు తొడుక్కో బుద్ధి య్యడంలేదమ్మా, అట్టే జాగ్రత్తగా దాచి పెట్టుకొందామనిపిస్తూంది."

"పిచ్చి తండ్రి, దాచిపెట్టుకోవడాని కట్రా చెప్పులు కుట్టించింది. యీ ఎండలో నీ కాళ్ళెట్లా మాడిపోతున్నాయో...యిక మీదటెప్పుడు చెప్పులు వేసుకోకుండా బయటకెళ్ళద్దు నాయనా"

"అట్లాగేనమ్మా, కాస్త నయంగానీ, చెప్పులు వేసికొనే పనిలో కెళ్తాను..."

రాము గొంతు బొంగురుపోయింది. తరువాత మాట పెగల్లేదు. గనిలో పనిజేస్తున్నప్పుడు ఒక పెద్దరాయి దొర్లి పడ్డంతో తన కుడికాలు నలిగిపోయిందనీ, శస్త్రచికిత్సజేసి డాక్టరు మోకాటిదాకా తీసివేశాడని ఎట్లాచెప్పగలడా మాతృమూర్తితో!!!

---



---

(512-వ పేజి తరువాయి)

తడియకుండ సుఖముగా నిలుసేర్పుమని యిష్టదైవమగు శారదాదేవిని భక్తితో ప్రార్థించి, వెంటనే యా వానలోనే తోట కరిగి యందు శారదాదేవి యనుగ్రహమున నొక్క చినుకైనను యాతనిపై బడకుండుట కానందించి తిరిగివెళ్లెను.

మఱునాడామె మనస్సుండబట్టలేక భర్త కష్టపాటును మాన్ప దలంచి స్వయముగా తోటకరిగి యచ్చటి పనులన్నియు చేయ దొడంగె. అట్లు చేయునపుడామె తన యాభరణములన్నియు తీసి మూటగట్టి అందొక చో దాచి పనులలో నిమగ్నయయ్యెను. నిరాలంకృతయై, సహజ సౌందర్యముతో నొప్పారు గాత్రిని గాంచియు, నామెకు తనయందుగల భక్తి ప్రపత్తులు గాంచియు శాలీనుడు మిగుల నాశ్చర్యపడి ఆమె నే పనియు చేయవలదని వారించెను గాని యామె వినదయ్యె. సహజ కరుణాన్వితుడును, ప్రకృతి స్వభావ సౌందర్యాభిలాషియునగు నతడు తన భార్య సౌందర్యమునకు వెఱగుపడి యాదరముతో నామెను చేరదీసెను. సుగాత్రియు భర్త యనుగ్రహమునకు పాత్రినైతిని గదా యను నానందముతో నిలుసేరె.

ఆ రాత్రి యామె రెట్టించిన యుత్సాహముతో వివిధాభరణములు ధరించి, విలువగల వలువలు ధరించి పతి సన్నిధి కరిగె. కాని శాలీను డుదయ్యమునో భూతమునో జూచిన ట్లేవగింపుతో పెడమొగమయ్యె. సుగాత్రి యాతని చర్యకు దిగ్భ్రమతో నిలువంబడిపోయె. సాయంత్రము తోటలో సంతోషముతో బలుకాడి ప్రేమతో యాదరించిన భర్తగారి యీ వింత ప్రవర్తన కాశ్చర్యపడి యీ విముఖతకు కారణమూహింపలేకపోయె. తుదకామె ధైర్యముతో బలుకరింప నీవెందుకు వచ్చితివి? నీకేమి గావలెనన్నాడు. ఈ ప్రశ్నతో యాతని వింత ప్రవర్తనకు వింతపడి యాతని మనస్సులో నేమియో కొఱత యున్నదని భావించినది. ఈ ఘట్టములోనే సుగాత్రి యుత్తమ గుణములు, హృదయ నైర్మల్యము వ్యక్తమై యామె గొప్పదనము గోచరించును. ఈ సందర్భమున యామె భర్తకు చెప్పిన మాటలు చూడ పూర్వ పతివ్రతామ తల్లుల దలపించును. యాతని మనస్సు విప్పి చెప్పినచో నెంతటి త్యాగమైనజేసి యా కొఱత దీర్ప తలంపామెకు గల్గినది. సహజమైన స్వార్థము వీడి, స్వసుఖమును వర్జించి భర్త సుఖాపేక్షతో పాతివ్రత్యము వెలయించిన మహా పతివ్రతలనేకమంది యామె స్మృతి పథములో మెఱపులవలె మెఱసినారు. వారిని తానాదర్శప్రాయములుగా బెట్టుకొను తలంపామెకు కల్గినది. ఉత్తమ గృహిణి, పతిసేవాసక్త, యెట్లు పలుకవలెనో యట్లె పలకినది. అల్లన పతి పాదములొత్తుచు

తుదజిక్కులేల మీ మది
కొదదీరినజాలు, నమ్ముకొనవలసిన వ
చ్చెద నమ్ముకొనుడు నన్నే
హృదయేశ్వర యేమిచింత, యిది దెల్పదగున్

ఈ విధముగా తన విశాల హృదయమును వెల్లడించినది.

ఇటు శాలీనుని యవస్థ యెట్లున్నదో చూడుడు. ఈమె యుపన్యాస మాతని హృదయమున కెక్కలేదు. ఆమె ధోరణి అర్థమేగాలేదు. శారదాదేవి కృపవల్ల నాతని చిత్త మింకొకరుపయి జేర్పలేదు. ఆయన యికనామె నమ్మవలసినంత అప్పుల బాధ లసలేలేవు. అతనికి గావలసినది గంగిరెద్దువలె నలంకరించుకొన్న సుగాత్రి తన కన్నుల యెదుటనుండి తొలగిపోవుటయే. సహజముగా భార్యయందు వాత్సల్యముగల తానామెను వెళ్ళమని చెప్పలేదు. ఇల్లటపల్లుడామె నామెను వెళ్ళమని యెట్లు చెప్పగలడు? కన్నెత్తి యా వేషమును చూడలేదు. ఈ అవస్థతో కళ్ళుమూసుకుని యామెకేమి ప్రత్యుత్తరమీయవలెనో తెలియక తికమకపడి నిరుత్తరుడై నిద్రించినాడు.

మరునాడు యథాప్రకారము శాలీనుడు తోటకేగినాడు. సుగాత్రియు నాతని ననుసరించినది. నిన్నటివలె సంతోషముతో నామె నాదరించినాడు. అప్పటికామె కాతని హృదయమవగతమైనది. నిత్యము తాను ధరించు ఆభరణములును, గృహము నందలి వివిధములగు శృంగారవస్తు సముదాయము నాతని కింపుగూర్పలేదనియు, ప్రకృతిరామణీయకము వెల్లివిరియు నీ పూదోటలును, తటాకములుమాత్ర మాతడు గాంక్షించుననియు, దెలిసికొన్నది. అనుదినమిట్లే యా పుణ్యదంపతులు కాలము బుచ్చుచుండిరి.

ఇట్లుండ నీ విషయమంతయు సుగాత్రి తల్లి చెలికత్తెలవలన నెఱింగి సంతోషించి యొకనాడామెతో నిట్లన్నది. "తల్లీ అతడు నీయందు విముఖుడై యున్న కారణముననే నాతనిని తోటపనికి నియోగించితిని గాని వేరొక యుద్దేశ్యముతో గాదుసుమీ! ఎప్పటియట్లు నౌకరులే వెళ్లుదురు మీరింటియందేయుండు"డనెను. అందుకు సుగాత్రి "అమ్మా నేను నా భర్తకెదురాడలేను" అన్నది. వెంటనే వారికి శారదాదేవి సాక్షాత్కరించి "ఈమె మహాసాధ్వి యీమెకు వంకలు దిద్దబోకు"మని మందలించి యదృశ్యయాయెను. ఆ రేయి యాగ్రామమునయున్న ప్రతి గృహస్థుకును శారదాదేవి ప్రత్యక్షమై సుగాత్రీ శాలీనులగాథ వ్రాయబడియున్న గ్రంధముల నొసంగి ప్రతినిత్యము పారాయణ జేసికొనుడని చెప్పి, అంతర్ధానమయ్యెను. ఆ గ్రామస్తులట్లే యాచరింపుచుండిరి.

తదుపరి కొంతకాలమునకు యెప్పటి యట్లు భార్యా భర్తలు తోటలో విహరించుచుండ శాలీనుడాదరముతో "కాంతా! నీకు వయస్సు ముదిరిన కొలదియు నీజవ్వనము పెరుగుచు నీ సౌందర్యము నినుమడింప జేయుచున్నది. కారణ మేమనను" అందుకా సుగాత్రి "దేవరకు నాయందుగల వాత్సల్యమే కారణము అంతకంటె నాకేమియు తెలియ"దన్నది. అపుడు శాలీనుడు "నీ యౌవనము చెక్కు చెదరకుండ నుండుటకై నీ కెప్పుడును సంతానము గలుగకుండ జేయుమని శారదా దేవిని వరము కోరుకొంటి"నని చెప్పెను. అంత సుగాత్రి యాశ్చర్యముతో "నేనా దేవిని మనకొక కొమరుడు గల్గునట్లు వరంబడుగ నా దేవి యందుకు సమ్మతించినదే! పరస్పర విరుద్ధములగు నీ రెండు వరములు నామె యెట్లు నెరవేర్చునో గదా?" యనెను. అంత శాలీనుడు మిక్కిలి యాగ్రహముతో "నా కెఱుక సేయక నా యిష్టమునకు విరుద్ధముగా వరంబడిగితివే" యని పరుగునబోయి సమీపమునయున్న మడుగులో దూకెను. పతి ప్రాణయగు సుగాత్రియు వెన్వెంటనే తాను నా మడుగులో దూకినది.

ఇంతటితో సుగాత్రి చరితము ముగిసినది. పాపమామె తల్లి మనుమల నెత్తి ముద్దాడ నువ్విళ్లూరు చున్నది. తానా తల్లికి యేకైక పుత్రిక. ఇవేమియు లెక్క సేయక భర్తకై తానును ప్రాణ సమర్పణ మొనర్చిన ధీర, సుగాత్రి తనయందు భర్త విముఖుడైయున్నప్పుడు నయిత మాతని యందవిధేయతగాని, నిరసనా భావము గాని ప్రకటింపలేదు. తల్లిగాని చెలులుగాని యాతనిని తూలనాడినపుడు వారిని మందలించి యాతనియందు తనకుగల గౌరవమును వెల్లడించినది. భర్త చిత్తవృత్తి తెలిసికొన్న తరువాత యాతని యానందమునకై తన సర్వాలంకారములు వర్జించి నిరాడంబరముగా జీవితము గడిపినది. తుదకు సంతానార్థియై శారదా దేవిచే వరము నొందియు భర్త కిష్టము లేదని తెలియగనే పతితోడిద లోకముగా భావించి యసువుల త్యజించినది. ఈమె గాధ ఉత్తమ గృహిణిగా మాత్రమేగాక మహా సాధ్వీ చరితముగా, మహోజ్వలముగా భాసించినది.

(ఆలిండియా రేడియో సౌజన్యముతో)

—— (o) ——

అక్టోబరు 2 వ తేది సాయంత్రం 4 గంll కు భవనమునందు విశాఖపట్టణంలో మహిళా సమాజపు సభ్యురాండ్రచే గాంధీ జయంత్సవము జరుప బడెను. శ్రీమతి K. చిట్టి కామాక్షమ్మగారు, శ్రీమతి N. లీలావతిగారు మహాత్మునిగురించి ఉపన్యసించిరి. సభకు సుమారు వందమంది స్త్రీలువచ్చిరి. పలువురు సభ్యురాండ్రు జాతీయ గీతములు, కర్నాటక సంగీతములు పాడిరి. కార్యదర్శిని శ్రీమతి ప్రాద్రంగి వెంకటరమణమ్మగారు ధన్యవాదములర్పించిరి. రఘుపతి రాఘవ, జనగనమన గీతములతో సభ జయప్రదముగా ముగిసెను.

# శ్రీ రామ కర్ణామృతము

( ఆంధ్రానువాదము )

శ్రీ కల్లూరి అహోబలరావు.



(గతసంచిక తరువాయి)

౮౭

నిగనిగలీను, మాణిక్యకాంతులు, గిరీ
టములనుండిదొరల - డంబు మీఱ
బ్రహ్మదేవుండును - ఫాలనేత్రుండు, దే
వేంద్రాది సురలు, నీ కెఱగుచుంద్రు ;
పార్వతి నీ పాద పద్మముల్ సతతంబు
స్తుతియించుచుండు ; సన్నుతులొనర్చి
కోదండధారివై - వేదండములఁబోలు
శత్రుసంహారణంబు సల్పుచుండు
వీశ్వరుని, మానసంబును శాశ్వతముగ
హరణమొనరించినావు ; విఖ్యాతమైన
కీర్తియబ్బెను శ్రీరామమూర్తి ! నిన్ను
సేవఁజేసెద రక్షింపు ; శ్రీ శుభాంగ !

౮౮

అంజలి జోడించి యాంజనేయుఁడుముందు
నాతనిచేరువ నంగదుండు
కుడిని, సుగ్రీవుండు గొమరొప్పి భజియింప
నా విభీషణుఁడుండె యతనిప్రక్క
వామభాగంబున, భామ సీతాదేవి
చెలువుగా నీ సేవ సలుపుచుండ,
లక్ష్మణానుజుఁడు, సలక్షణంబుగ వెన్క-
ప్రక్కన ఛత్రంబుఁ బట్టియుండ
వీరిమధ్యను శ్రీరామ ! వేడ్కతోడ
ముఱియుచున్నావు ; జ్ఞానులు ముదము
జెలఁగ
నిన్ను ధ్యానించుచున్నారు - నిర్మలాత్మ !
రమ్యగుణధామ! శ్రీరామ! సౌమ్యనామ!

౮౯

పాలసముద్రంబుబరగు ; నా మధ్యలోఁ
దెల్దీవి యొక్కండు వెలయుచుండుఁ
గనకాద్రి యాద్వీపకంబులో వెలయును
కల్పవృక్షములందుఁ గాంతులీను
కల్పకంబులక్రిందఁ గనకమంటపముండుఁ
గనకమంటపమునఁ గాంతులొసఁగు
వేదిక చెన్నారు ; విభ్రాజమానమౌ
సింహాసనంబందుఁ జెలఁగుచుండు ;
దాన, బంగారు పద్మంబు దనరుచుండు
నందు, వీరాసనముబూని సుందరాంగ !
రామ ! శోభించుచున్నావు రమణితోడ
నిన్ను సేవింతు నిరతంబు నిగమవినుత !

౯౦

పిడుగులఁబోలెడి భీషణ బాణముల్
రవికోటికాంతులఁ గ్రక్కుకొనుచు
బ్రిహ్మదులెల్ల-'సెబాసన' నీ ధను
స్సునుండి వెడలివచ్చుచు, ముకుంద !
రక్కసవరుల దోర్బలము రూపడగించె ;
సుగ్రీవవానర శూరవరులు
శ్రీరామ ! మేల్కొని పోరాటములసల్పి
నీ యాజ్ఞ భక్తి మన్నించినారు ;
ఖలులు రాక్షసాళి ఖండింపఁబడినారు
సాధుసజ్జనాళి సంతసంబు
బొందినారు, సుఖములందిరి ; శ్రీరామ !
వందనంబు నీకు సుందరాంగ !

(సశేషము)

# స్వీకారము



**జలపాతం (కథల సంపుటి) : శ్రీ పులిపాక జగన్నాథరావుగారు, హిందూ కళాశాల, గుంటూరు. వెల 0-4-0.**

ఇది చిన్న పుస్తకమైనా కథలు ఉత్తమోత్తమ భావాలతో సహజంగా నున్నవి. పాఠకులు చదువుతున్నంతసేపు ప్రత్యేక ఆసక్తి కలిగి మైమరచి పోగలరు.

రచయిత అనుభవశాలి మాత్రమేకాక ప్రజల మనస్తత్వాల కనుగుణ్యంగా కథానికలను వాస్తవికత ఉట్టిపడేలాగ రచించడం విశేష. పేరు ప్రతిష్టలను రచయితకు సమకూర్చగలదు.

**దివ్య జీవనము : గ్రంథకర్త శ్రీ స్వామి శివానంద సరస్వతి మహారాజ్, సంపాదకులు శ్రీ నండూరి వెంకట సుబ్బారావుగారు. ప్రకాశకులు : యోగ వేదాంత అరణ్య విశ్వ విద్యాలయము; శివానంద నగరము, హృషీకేశము (హిమాలయములు) వెల రు. 3-0-0.**

ఇందులో స్వామిజీ ఆధ్యాత్మికంగా సామాన్య ప్రజానీకంను సయితం వివిధ శీర్షికలతో విజ్ఞాన విలునుతులను చేశారు. అంతేకాక సేవాధర్మాలు, శాస్త్ర విజ్ఞానము, యాత్రా స్థలముల విశేషములాంటి అమూల్య విషయములతో శ్రీ స్వామి శివానందగారి సందేశము, జీవిత చరిత్ర, స్వామిజీ ఆరాధనకు సంబంధించిన శీర్షికలు, బోధనలు కలవు. స్వామిజీ భక్తుల సంపాదితము కాబట్టి యీ గ్రంథము సమగ్రతను పొంద కలిగినది. సామాన్య ప్రజలు యీ గ్రంథ పఠనము వలన అనేక విధముల, అనేక రంగాలలో ఆదర్శనీయమైన పవిత్ర జీవితమును తీర్చి దిద్దుకో గలరు.

**ఆంధ్ర జాతీయ గీతము : కవి సామ్రాట్ శ్రీ సుబ్బరాయ శాస్త్రిగారు**

ప్రతి జాతికి, దేశానికి ఉత్సాహ పరచడానికి, ఉత్తేజ పరచడానికి జాతీయ గీతాలు అమోఘంగా వినియోగపడతవి. అలాగే ఆంధ్ర ప్రజల కుద్దేశించిన యీ గీతము భావయుక్తంగా చైతన్యమును పూరిస్తున్నది.



# సంపాదకీయములు

## వరకట్నాల నిషేధము

వరకట్నాలను నిషేధిస్తూ చట్టము రూపొందనున్న యీ సమయంలో ఎలాగైనా చాటు మాటుగా కట్నాలను గుంజడానికి మార్గాల నన్వేషిస్తున్న స్వార్థపరు లుండనే యుంటారు.

వరకట్నాల నిషేధం సామాన్య ప్రజానీకపు శ్రేయస్సుకని ఉద్దేశించినది. ప్రతియొక్కరు బాధ్యతతో వరకట్నాల నిషేధ చట్టం అమలుజరిగే సందర్భమున సహకరించిననే గాని చట్టనిర్మాణోద్దేశము ఫలించదు.

తమ బిడ్డలకు చదువు చెప్పించేది, ఆస్థి పాస్తులను కూడబెట్టేది ఆర్థిక వసతుల ఉండిలేములు గుర్తించకుండా కట్నాలు గుంజడానికి కాదని గ్రహించాలి. తమ తాహతుకుమించి ఆస్థిపాస్తులను అమ్మి తమ కుమారులకు కట్నము వస్తుంది కదా యనే పేరాశతో చదువు చెప్పించి, చివరకు కూటికి గుడ్డకు కూడ వస్తుందని ఎదురు చూడబడుతున్న కట్న కానుకలపై ఆధారపడేవారికి యీ చట్టం ప్రాణ కంటకం కావచ్చు. కాని లేని ఘనత ఉన్న దనుకుని విరగబడేవారికి కట్న కానుకలనేకాదు కదా బిడ్డల వివాహమునకు సయితం యోగ్యత లేదని రాయి గుద్ది చెప్పవచ్చును.

కట్నం యివ్వ పూనుకున్నవారు, తీసికొన పూనుకున్నవారు ముమ్మాటికి శిక్షార్హులే. ఆడ పిల్లకు వివాహం కావడానికి ఆమె తండ్రి యివ్వగల కట్నము ఏనాడు యోగ్యత కాకూడదు. రూప లావణ్యాలు, వంశ గౌరవము, విద్యా విజ్ఞానాలు ప్రధాన యోగ్యతలు కావాలి. యువతీ యువకులు పరస్పర సమ్మతితో, తమ అభివృద్ధిని, క్షేమ సౌభాగ్యాలను అభిలషించే తల్లిదండ్రుల సద్భావముతో వివాహాలు జరగాలి. వివాహానంతరమైనను యిచ్చి పుచ్చుకున్నవారు విశాల హృదయములతో సానుభూతి కలిగి తమ బిడ్డల అభ్యుదయ, అభివృద్ధులకు తోడ్పడాలి.

తమ మొగ బిడ్డలు అప్రయోజకులు, అయోగ్యులయినా కొద్ది, గొప్ప ఆస్థియో, లేక చదువుమాత్రమున్నంత మాత్రాన ఎవళ్లు వేలుయిస్తారా కట్నంగా అని ఎదురుచూచే వారిని కాని, కట్న కానుకలు యివ్వనిదే తమ పిల్లవానికి యితరుల పిల్లను వివాహం చేయమనే వారినికాని, లేదా తమ బిడ్డల కెలాగోలాగ పెళ్ళి చేయాలనే ఆదుర్దాతో కట్నాలిస్తామంటూ ఎగబడే ఆడ పిల్లల తండ్రులను కాని చట్టం శిక్షించి ఆడ పిల్లల పెండ్లిళ్ళుకని చితికిపోతున్న సంసారాలను రక్షించాలంటే ప్రజలు ఎవరికివారు గూడాచారులుగా వ్యవహరించి కట్న కానుకల బేరాలలోకూడ 'చీకటి బజారు' సృష్టిని అరికట్టాలి!

వరకట్నాల నిషేద చట్టం సామాన్య కుటుంబాల శ్రేయస్సు కుద్దేశించినది. దానిని వినియోగించుకొని రక్షణ పొందవలసినవారు వారే.

సంపన్నుల కున్న అవకాశాలతోబాటు తమ ఆడ పిల్లలకు మాత్రమే మంచి సంబంధాలు కుదిరి, సామాన్య ప్రజల ఆడ పిల్లలు యీడుజోడు అయిన సంబంధాలకు నోచుకోకుండటం ప్రజాకోటికి మొత్తానికి సిగ్గుచేటు. సంపన్నుల మనస్తత్వాలు సయితం విశాలమై అభ్యుదయ మార్గాన్ని అనుసరించాలి.

---

## శ్రీ దుర్ముఖినామ సం॥ర ఆశ్వయుజ, కార్తిక మాసములు

| | | | |
|---|---|---|---|
| 1956 సం॥ అక్టోబరు నెల | 16 | మం | ద్వా 34.16 శత 17.6 త్యా 4.27 |
| | 17 | బు | త్ర 35.31 పూభా 21.55 |
| | 18 | గు | చతు 39.48 ఉభా 25.51 |
| | 19 | శు | ○ పౌ 40.58 రే 28.44 అమృత సిద్ధియోగం |
| | 20 | శ | కృ పా 40-28 అశ్వ 30-29 త్యా 4-7 రా 25-36 త్యా 4-2 |
| | 21 | ఆ | ద్వి 39.38 భ 30.59 త్యాజ్యాభావః |
| | 22 | సో | త 37.2 కృ 30.16 |
| | 23 | మం | చ 33-19 రో 28-25 |
| | 24 | బు | పం 28-37 మృ 25-33 |
| | 25 | గు | ష 23-7 ఆర్ద్రా 21.53 తిథిద్వయం |
| | 26 | శు | స 17-4 పున 17-40 |
| | 27 | శ | అ 10-43 పుష్య 13-8 |
| | 28 | ఆ | న 4.17 ఏవ్యం 53.39 ఆశ్లే 8-32 |
| | 29 | సో | ఏ 52.11 మఖ 4-10 స్మార్తైకాదశి |
| | 30 | మం | ద్వా 47-11 పూఫ 0-18 ఉఫ 56.40 త్యా 3.47 |
| | 31 | బు | త్ర 43-8 హ 54.48 |
| | 1 | గు | చతు 40.11 చిత్త 53.45 మాస శివరాత్రి |
| | 2 | శు | ● అమా 38.27 స్వా 53.54 దీపావళ్యమావాశ్య |
| | | | **కార్తిక మాసము** |
| 1956 సం॥ నవంబరు నెల | 3 | శ | శుపా 37.57 విశా 55.17 కార్తిక స్నానారంభము |
| | 4 | ఆ | విది 38.43 అనూ 57.50 త్యా 4.11 |
| | 5 | సో | త 40-38 జ్యే 60-10 |
| | 6 | మం | చ 43.37 జ్యే 1.43 నాగచతుర్థి |
| | 7 | బు | పం 47.23 మూల 6-19 |
| | 8 | గు | ష 51.47 పూషా 11-38 త్యా 4.24 |
| | 9 | శు | స 56-33 ఉషా 17-23 |
| | 10 | శ | అ 60.10 శ్ర 23.22 |
| | 11 | ఆ | అ 1.19 ధని 29.18 త్యా 4-23 |
| | 12 | సో | న 5-52 శత 34.55 త్యా 4.20 |
| | 13 | మం | ద 9.54 పూభా 39-57 త్యాజ్యాభావ |
| | 14 | బు | ఏ 13.10 ఉభా 44.8 |
| | 15 | గు | ద్వా 15-28 రేవ 7.19 |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press,
Kesari Kuteeram (Private) Ltd. 15, Westcott Road, Royapettah, Madras.
Ag. Editor : C. C. Punniah.




## సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు. 4-8-0. అర్ధసంవత్సరపు చందా రు. 2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలా బిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీల కందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్కసిరాతో స్పష్టముగ తప్పులు లేక వ్రాయవలెను. భాష గ్రాంధికము గాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వ హక్కులు గలవు. ప్రకటింప నంగీకరింప బడినపుడు మాత్రము రచయితలకట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లై కార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

## చిరునామా మార్పు

చిరునామాయందు మార్పున్నచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం ప్రైవేట్ లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.